


అనువాదం

## నండూరి రామమోహనరావు

**వెల రూ. 1-8-0**

పోస్టు ఖర్చులు ప్రత్యేకం

---

వివరాలకు

# ఆంధ్ర గ్రంథమాల

మద్రాసు 1.

# భారతి

[సచిత్ర మాసపత్రిక]

సంపాదకుడు:
శ్రీ శివలెంక శంభుప్రసాద్



ఆంధ్రపత్రికా ముద్రాలయము
మదరాసు.

సంపుటము 3[illegible] జూన్, 195[illegible] సంచిక 6

ప్రతి వెల ఒకరూపాయి.

తెల్లగా
ఉతుకబడినవి

ప్రకాశవంతముగా
ఉతుకబడినవి

ఇందుకు
సన్‌లైట్
సబ్బే
కారణము

SUNLIGHT

బాదకుండగనే బట్టలను తెల్లగాను ప్రకాశవంతముగాను ఉతుకును.

---

S. 100-50 TL



# విషయానుక్రమణిక

## జూన్- 1952



త్రివర్ణ చిత్రము—'విశ్రాంతి' సి. యస్. యన్: పట్నాయక్‌గారు

పక్షిరాజా వారి

# కాంచనా

లలిత ...... పద్మిని
కె ఆర్. రామస్వామి
దొరైరాజ్
పుష్పేంద్రమణి
రామ శర్మ
కుమారి
దొరైస్వామి నటించినది..

మాటలు పాటలు
తిక్లైటి
డైరెక్షన్
S.M శ్రీరాములు నాయుడు

జూన్ 12 వ తేదీన ఆంధ్రదేశములో ముఖ్యకేంద్రాలల్లో విడుదల



జూన్ 6 న విడుద
యువా వారి
టింగ్ రంగా
డైరెక్టర్ B A సుబ్బారావు
ప్రొడ్యూసర్ PS శేషాచలం
రచన తాపి
పూర్ణా రిలీజు
స్టూడియో వాహిని




YUVA

Guha




నందన
జ్యేష్ఠము

# భారతి

సంపుటము 29
సంచిక 6


# మస్తిష్కంలో లేబొరేటరీ


శ్రీ దాశరథి


★

మొహెంజొదారో శిథిలాల లోతుల లోకి—
శతాబ్దాల మట్టి పొరల క్రింద బుగ్గైపోయిన పురాతన
   నాగరికతా గర్భంలోకి—
సూర్యుడు అస్తమించిన జాడల్లోకి ఒకదారి;
మరోదారి
మస్తిష్కంలోని మాయింటికి

మా యింటి వెనుకగా—
తాజమహల్ అందాల్లో మెరిసిన షాజహాన్ కీర్తి,
అశ్రు కణ్ణులతో
బులుక్కులతో కట్టిన వైయాకరణి సమాధి,
లోకాన్ని అడక్కుండా ఎవడో దుష్ట నృపతి రచియించిన
కఠిన శాసనాల రాసులు—
మరి మాయింటి ముందుగా—లేబొరేటరీ
వేదాలు దొరికే నా పెన్సిల్ ముక్కులో—

జగత్తుకు ప్రాణం ప్రసాదించిన కార్బన్ పరమాణువు,
అందులో సెంట్రల్ న్యూక్లియస్ చుట్టూ చాంద్రాయణం చేసే
ఆరు ఎలెక్ట్రానులు—
సూర్య తేజోరాశిచుట్టూ శనీ గురువూ మరోడు మరోడు
వాళ్ళవెంట భూమి తల్లి ప్రదక్షిణం చేసినట్లు

మరి అనాటి పాతగంటం కంటిలో—
రాక్షసీ వికటాట్ట హాసం,
రంభోర్వశీ వాక్ విలాసం,
రాజుల పాదాల క్రిందుగా పరచిన
రైతుల రతనాల బ్రతుకుల తివాసీలు
పాతకాలం పసిడి రంగుల బరువు లోర్చిన
పట్నవాసపు మ్యూజియంలో—
పసందైన శ్యామాకమలాల మెత్తదనం హొత్తుకున్న చిత్తరువులు
శిలా విగ్రహాల సీత్కారం
అలంకారాల బలాత్కారం

మరి నాలో లోపలి చిత్రశాలలో
చిత్రించరాని
శిల్పంకూర్పలేని వేదన
చితికిన ఆటం వంటి బతుకులో ప్రణయం కదాచిత్ !
శిశిరంలో గుడ్డలూడిన,
రహస్యాలు లేని, దెయ్యాల ఆడబిడ్డలవంటి
పెద్ద పెద్ద మోడుగు వృక్షాలకు
నిప్పు బట్ట కట్టించిన రీతిని—

నా వేదనలో జన్మించిన ఊహింపులు
తొడగడానికి వ్యాకరణ సూత్రపు రెడీమేడ్ దుస్తులు లేక
దినమొలల్తో తిరుగుతున్నాయి లోకాన పక్షి;
దండించనా,
రండి రండని పిలిచి నా కవిత్వపు
పండు టెరుపు చేలా లందించనా!

కటికరాతిగోడలతో కట్టిన కారాగేహంలో
గత కాలపు శాసనాల
కట్టుబడిన హైదీపాలే

భయం భయంగా, అవృన్ను అవృన్నుగా
గాలి పీల్చుకుంటూ వేం భాయీ !
ఊపిరితిత్తుల్ని కొలిమి తిత్తులుగా
నొక్కి నొక్కి ఊది ఊది మండించవోయ్ మానవతా జ్వాలావళి.
కదల్లేని వృక్షం వలె
కాలం అక్కడక్కడే పెరగ్గలదా !
'నయాగరా' జలపాతం వలె
నడుం విరిగేట్టు దూకంది తప్పదు గదా !
తిరగనీ కాలాన్ని సుళ్లు సుళ్లుగా ,
పడనీ బ్రతుకు నిండా చిక్కులు ముళ్లు ముళ్లుగా.

డొక్కకు బాగా ఆకలిరుచి దొరకనీ—
చలి వీణలు నరాలలో చొరబడి
చక్కని పాటనొకటి వాయించనీ—
ప్రశ్నలు గొలుసులు గొలుసులుగా
బంధింపనీ మన మేధను—
దూకి దూకి ఈ జలపాతం
ప్రాకించనీ పైకిపైకి విద్యుద్వల్లీ మతల్లికలను—
సన్నని ఇసుక కణం పరీక్షించి
జగజ్జాతకం వ్రాయనీ శాస్త్రజ్ఞులను—
పడిగ్రీలో వేడి నిలిస్తే
ఏరకం ప్రాణికోటి పుడుతుందో—
పడిగ్రీల వేడి జారితే
ఈ విశ్వ మహాగోళం మృత్యుజలధి అంతస్సున
తన్నుకులాడి నశిస్తుందో—
ఏ ఖిల్లా గోడనీడ
ఏ మహారాజ వంశాన్ని ఎంతకాలం కాపాడిందో ,
ఏ రకం ఎత్తుగడల్తో పెత్తనం
ఎవడెవడి చేతిలో ఎన్నెన్ని నాళ్లుంటుందో
పరిశోధించు ఈ లేబొరేటరీలో.

అజంతాలోను హాలంత భాషలోను
శిలా సుందరికి లేని
క్షుద్బాధా సంచలనం
పల్లెపడుచు కున్నాదని గమనించుకో భాయీ !

నిశ్శబ్దంగా నిదరోయే
నిరపరాధి పరమాణువు
దొక్క చించి డోలుకట్టి
ప్రమాదాలు తేలేరు.
మస్కెట్లనుండి రైఫిళ్ళదాకా నడచిన దేశం
కొడవళ్ల నుండి* కోత యంత్రం దాకా సాగలేదు

చల్లని పాలులాగే పిల్లలవంటి
రసిక శిఖామణుల నాల్కలు
వేడి వేడి కవిత్వం చురుకుదనం సహించేదాకా రాలేదు.
ఇంకా అక్కడక్కడా ఎత్తైన గడీ గోడ నీడలు
చిన్ని చిన్ని గుడిసెల్ని పెరగ నీయడం లేదు—
ఇంకా భయంతో తలవంచుకుని
తన నీడనే తాను చూసుకుంటూ
బరువుగా బరువుగా నడుస్తున్నాడు బానిసీడు.

ఇంకిపోయిన పెద్ద పెద్ద సముద్రాల వలె
జీవం చచ్చిన పాత జాతుల నోళ్లలో
ఒక పెద్ద ప్రళయ జలధరాన్ని పట్టుకువచ్చి
కట్టివేసి ఉరిమించి ఉల్కలు కురిపించి కరగించి
జీవనం ప్రసాదించే సుభిక్షకాలం ఇంకా రాలేదు.

ఇన్ని శతాబ్దాలు ప్రయాణం చేసినా
ఇక్కడేవున్నాం ఊర్పూరి పొలిమేర పక్కన
డార్విన్ బయాలజీలో పరిణామాల పట్టిక
పది యోజనాలంత వున్నా
మానవుడు మానవుడయ్యే కాలాన్ని
నిర్దేశించగల ప్రదేశం కానరాదు !

గతంలోంచి కొంత నేర్చుకోపోయి
గతానికి తాకట్టు పడుతున్నారు కవులు
ఈ లేబొరేటరీలో కూచుని
లోకంనిండా విరివిగా శాంతి పండే రీతిని
కొత్తరకం విత్తనాల్ని
కనిపెట్టే వీలున్నది.

* *Harvestor.*

ఈ లేబొరేటరీలో కూచుని
కలం పాళీ కొనలోంచి
ఎంత బలంగల కవిత్వం సృష్టించ వచ్చో—
చెడాడి స్వేదం లోంచి ఎంతగా
దేశానికి జీవం ప్రసాదించ వచ్చో---
నిరాశతో ఏడ్చే దరిద్రాంగన
కన్నీటి చుక్కలకు
ఎంత దూరాన నవ్వు పువ్వులున్నాయో—
హృదయంలో ఏ పొరలో దయ
ఏ తెరలో నిర్దయ
ఏ దిక్కున త్యాగం
ఏ దిక్కున రాగం దాక్కుని సెల వేస్తాయో—
కనిపెట్టే అవకాశం
ప్రసాదించి నా నిదిగో!
పని సాగించుకు భాయీ!
బ్రతుకు నాగజముడు కూడ
పూలు పూయనీవయ్యా!
మెతుకులలో ప్రోటీనులు
మిక్కిలిగా రానీవయ్యా!
బక్కపడిన దేహానికి
పొందు పొందు మాంసానికి
ఎంత తిండి కావాలో
ఎంత హాయి కావాలో
అవి అన్నీ కల్పించే
అమృత ఘుటికలోనరసైం
నిరీక్షించు మానవునికి
త్వరగా ఫల మందించే
మార్గా న్నన్వేషించు!
మస్తిష్కంలో వెలిగే
మా యింటికి ముందుండిన
లేబొరేటరీ తెరచి వుంది.
మధనపడే మేధావుల
శిధిలాశలు చివురించే
రసరాజ్యం, లేబొరేటరీ!

# ఇవాన్ ఇలియిచ్ మృతి

మూలం :
లియో టాల్‌స్టాయ్



అనువాదం :
శ్రీ పి. గణపతిశాస్త్రి

టాల్‌స్టాయి 'ఇవాన్ ఇలియిచ్ మృతి' (The Death of Ivan Ilych) అనే ఈ చిన్ననవల 1886లో రచించాడు. ఈనవలారచన బహుశః 1882 లోనే ప్రారంభమై ఉండవచ్చునని విమర్శకు లూహిస్తున్నారు అంటే ఇది ముగించేసరికి ఇంచుమించుగా నాలుగు సంవత్సరాలు పట్టిందన్నమాట.

ఈ చిన్ననవల ముగించేసరికి టాల్‌స్టాయికి 58 ఏళ్లు నిండాయి. అప్పటి కప్పుడే ఇతడు 'ఎన్నా కెరనినా' మొదలైన గొప్ప గొప్ప నవలలు రచించి ప్రపంచవిఖ్యాతుడైనాడు. ఈ కాలంలో టాల్‌స్టాయి రచించిన రచనలన్నిటిలోను ఇది ఉత్తమోత్తమమైనదని విమర్శకులందరు ప్రశంసించారు ప్రకటించిన కొద్దిరోజుల్లోనే ఇది రష్యాలోను, మిగిలిన యూరపులోను ఒక పెద్ద సంచలనం కలిగించింది. రోమాం రోలాం వంటి విఖ్యాతనవలారచయిత ఫ్రాన్సులో అంతటా ఇది పాఠకుల మన్ననలందుకొన్నదనీ, పాశ్చాత్యధనిక వర్గాల జీవితాని కిది ప్రతిబింబమనీ ప్రశంసించాడు.

టాల్‌స్టాయి, సునిశితమైన నైతికదృక్పథంలో వాఙ్మయసృష్టి చేసిన మహాశిల్పి 'ఇవాన్ ఇలియిచ్ మృతి'లో ఈదృక్పథం ఒక పరమావధికి వెళ్లి నట్టుకనిపిస్తుంది. ఇంచుమించుగా ఇది టాల్‌స్టాయ్ స్వీయ చరిత్రవంటిదే అని ఒక ప్రసిద్ధవిమర్శకుడు వ్రాశాడు.

## 1

మొల్విన్‌స్కీ కేసు విచారణ కొంతవరకు నడిచినతరవాత పబ్లిక్ ప్రాసిక్యూటరు, మిగిలిన న్యాయాధిపతులు అంతా కలిసి విశ్రాంతి సమయంలో ఎగరోవిచ్ గదిలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. క్రమంగా వారందరు క్రసోవిస్కీ కేసునుగురించి మాట్లాడుకోవడం మొదలుపెట్టారు. అది చాలా గొప్పకేసు. అయోద్దరు ఆకేసు విచారణ చేసే అధికారంలేదని వాసిలీవిచ్ గట్టిగా వాదిస్తూంటే ఆ అధికారం ఉండితీరవలని ఇగరోవిచ్ కొట్టి చెప్పారు

ఈ వాదోపవాదాలు ఇలాగ సాగుతున్నా మొదటినించీ ఉలుక్కుండా పలుక్కుండా ఒకచోట కూర్చున్న పీటర్ ఇవానోవిచ్ అప్పుడే వచ్చిన గెజెట్ చేతులోకి తీసుకొని తిరగేస్తూ "ఇవాన్ ఇలియిచ్ చచ్చిపోయాడని[illegible]న్నాడు

"నిజంగా!"

"ఇదిగో! మీరే చదవండి" అని ఇవానోవిచ్ వాసిలీవిచ్‌కి ఆ గెజెట్ అందించాడు అది అప్పుడే అచ్చుపడింది. అందుచేత ఇంకా తడితడిగానే

ఉంది. చుట్టూరా అచ్చువేసిన నల్లని అంచుల మధ్యన ఆ గెజెట్ ప్రకటన ఇలాగ ఉన్నది "కోర్టులో న్యాయాధిపతిగా ఉండిన తన భర్త, ఇవాన్ ఇలియిచ్ 1882 ఫిబ్రవరి 4 వ తేదీని మరణించి నారని బంధుమిత్రులకు తెలుపడం చెయ్యడానికి ప్రెస్కోవ్యా ఫెడరోవ్నా మిక్కిలి విచారిస్తున్నది శుక్రవారంనాడు మధ్యాహ్నం ఒంటిగంటకు అంత్యక్రియలు జరుగుతాయి."

అక్కడ ఉన్నవారి అందరితోబాటే ఇవాన్ ఇలియిచ్ కూడా ఆ కోర్టులో న్యాయాధిపతిగా ఉంటేవాడు. అందరూ అతన్ని ఎంతో ఆప్యాయంగా చూసేవారు. కొన్ని వారాలనించీ అతను ఒక వ్యాధితో బాధపడుతూంటేవాడు. అంతా అది గడ్డువ్యాధి అని అనుకునేవారు. జబ్బుతో ఉన్నప్పటికీ అతని పదవి అల్లాగే ఖాళీగా ఉంచారు. కాని అతను చని పోవడం జరిగితే అలెక్సీవ్ ను ఆ ఖాళీలో వేస్తారనీ, అలెక్సీవ్ ఖాళీలో విన్నికోవ్ నుగాని, స్టాబెల్ నిగాని వెయ్యవచ్చుననీ ఊహాగానాలు బయలుదేరాయి. అయితే ఇలియిచ్ మరణవార్త వినగానే అక్కడ ఉన్నవారందరికీ, అతని మృతివల్ల తమకు, తమ బంధుమిత్రులకు ఆయా ఉద్యోగాల్లో రాబోయే మార్పులు, అధికారాలుమాత్రమే మొట్టమొదటగా స్ఫురించాయి.

స్టాబెల్ పదవిగాని, విన్నికోవ్ ఉద్యోగంగాని తప్పకుండా తనకు దొరికి తీరుతుందనీ, ఆ ఉద్యోగం తనకిస్తామని అధికారులు చాలకాలం క్రితమే వాగ్దానం చేశారనీ, దానివల్ల అలవెన్సులు అన్నీకాక సంవత్సరానికి ఇంకా ఎనిమిదివందల దాకా తన ఆదాయం పెరుగుతుందనీ వాసిలీవిచ్ అను కున్నాడు.

పీటర్ ఇవానోవిచ్ ఇలాగ అనుకున్నాడు "నే నిప్పుడు మా బావమరిదిని కలుగానించి బదిలీ చేయించే ప్రయత్నంలో పడాలి. ఇది జరిగితే మా ఆవిడ ఎగిరిగంతులేస్తుంది. ఇక నామీద తనవాళ్లకు నేనేమీ సహాయం చెయ్యడం లేదనే నింద వెయ్యడం మానివేస్తుంది."

"ఇక ఇలియిచ్ లేచితిరుగుతాడని నేననుకోలే దు. పాపం ఎంతపని జరిగింది!" అని పీటర్ ఇవానో విచ్ గట్టిగా అన్నాడు.

"అయితే ఇంతకీ ఆ వ్యాధేమిటో తెలి సిందా?"

"డాక్టర్లకైతేనే ఏమీ అంతు దొరకలేదు. చివరికి ఏదో పేరు పెట్టారుగాని, అందరికీ తలో దారీ అయింది. వనక నే నతన్ని చూసినపుడు కొంచెం నయంగానే ఉందనుకున్నాను."

"పెళ్ళిలిచ్చినప్పటినించీ, నేనతన్ని చూడ నేలేదు. ఎప్పటికప్పుడు ఒక సారి వెళ్ళిచూడాలని అనుకుంటూ ఉంటేవాణ్ణి."

"ఇలియిచ్ కి ఏమన్నా ఆస్తి ఉందా?" "అతనిభార్యకి ఏదో కొంత ఉన్నదని అనుకుంటాను. కాని అంతగా చెప్పదగ్గ ఆస్తికాదు."

"మనమంతా ఒకసారి అతన్ని చూసిరావాలి కాని ఆ ఇల్లు చాలాదూరం!"

"అంటే మీ యింటికి వాళ్ళిల్లు చాలా దూరం అన్నమాట! ఆ మాటకొస్తే మీయింటికి అన్నీ దూరమే."

షెబెక్ అన్న ఈ మాట విని ఇవానోవిచ్ ఒక చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు "నేను ఏటికవతల ఎక్కడో ఉన్నానని ఇవాన్ ఇలియిచ్ ఎప్పుడూ నామీద ఒక నింద వేస్తూంటేవాడు."

ఆపైన వారందరు ఆ పట్టణంలో ఒక చోటికీ, మరొకచోటికీ ఉన్న దూరభారాలను గురించి కబుర్లు చెప్పుకుంటూ తిన్నగా కోర్టులోకి వెళ్ళిపోయారు.

ఇవాన్ ఇలియిచ్ మృతివల్ల ఇంచుమించుగా ఏర్పడే ఖాళీలను గురించీ బదలాయింపులనుగూర్చీ, రాబోయే పెద్ద పదవులనుగురించీ తట్టిన ఆలోచనలతో బాటు సామాన్యంగా అందరి మల్లేనే వారికికూడా "అమ్మయ్య! ఆ చచ్చిపోయింది అతనేగాని నేను మాత్రం కాదు" అనే ఆలోచనకూడా కలిగింది.

ప్రతివాడు తన మనస్సులో "సరే! ఇలియిచ్ చచ్చిపోయాడుగాని నేనుమాత్రం బతికేఉన్నాను కాదా!" అనుకున్నాడు. అయితే ఇవాన్ ఇలి యిచ్ దగ్గిర బంధుమిత్రులు, అతని స్నేహితులనబడే వాళ్ళు, అంత్యక్రియలు జరిగే సమయానికి నానా అవస్థలుపడి అక్కడికి వెళ్ళాలనీ, ఇలియిచ్ భార్యను ఒకసారి పరామర్శించవలసిన పెద్ద బరువు తమమీద విధిగా పడిందని బాధపడ్డారు.

వాసిలోవిచ్చీ, ఇవానోవిచ్చీ ఇవాన్ ఇలియిచ్‌కి చాలా దగ్గిర పరిచితులు. ఇవానోవిచ్చీ, ఇలియిచ్చీ న్యాయశాస్త్రాలలో కలిసి చదువుకున్నారు. అందుచేత ఇవానోవిచ్ ఇలియిచ్‌కి, తనకు బాగా సన్నిహితత్వ మున్నదని భావించుకున్నాడు. ఇవానోవిచ్ ఇంటికి రాగానే భోజనాలవేళ భార్యతో ఇలియిచ్ చనిపోయినవిషయం చెప్పాడు. ఆపైన తన బావమరిదిని తనకు దగ్గిరగా బదిలీ చేయించుకునే అవకాశాలు ఉన్నాయని కూడా భరవసా ఇచ్చాడు. ఆ పిమ్మట సామాన్యంగా మధ్యాహ్నంవేళ అనుభవించే నిద్రా సౌఖ్యాన్ని త్యాగంచేసి, సాయంకాలం దుస్తులు వేసుకుని, గుర్రపుబగ్గీమీద ఇవాన్ ఇలియిచ్ భవనానికి బయలుదేరాడు.

ఆ భవనానికి ముందుగా ఒక గుర్రపుబగ్గీ, ఇంకా మరిరెండు ఇతర బగ్గీలు నిలబడిఉన్నాయి. లోపలికి పోగానే కిందిహాలులో గోడకుదగ్గిరగా పరిగంధ పట్టువస్త్రాలతో కప్పిన శవపేటిక కనబడింది. అప్పుడే మెరుగుపెట్టిన ఆ పెట్టెమీది బంగారు బందులు, మేకులు తళతళా మెరుస్తున్నాయి. అక్కడ నిలబడిఉన్న స్త్రీ లిద్దరు తమ ఉన్నికోటులు విప్పివేస్తున్నారు. వారిలో ఒక స్త్రీ ఇవానోవిచ్‌కి పరిచితురాలే. ఆమె ఇవాన్ ఇలియిచ్ చెల్లెలు. కాని రెండవ స్త్రీ ఎవరో ఇవానోవిచ్‌కి తెలియలేదు. ఇవానోవిచ్ సహాన్యాయాధిపతి ష్వారెక్ అప్పుడే మేడదిగి కిందిహాల్లోకి వస్తున్నాడు. ఇవానోవిచ్‌ని చూడగానే అతడు ఒక్కసారిగా నిలబడిపోయి అతనివేపే చూసి కన్నుగీటాడు. "చూశావా! ఇలియిచ్ తనవ్యవహారాలన్నీ అధ్వాన్నపు ఆడిలో విడిచిపెట్టి పోయాడు! నేనుగాని నువ్వుగాని అయితే ఇలాగ జరగనిస్తామా!" అన్నభావం ఆ కన్నుగీటులో మెరిసింది.

ఆ బుగ్గమీసాలు, పరాకులాడుతున్న అతని శరీరము, ఆ సాయంకాలం దుస్తులు చూస్తే ష్వారెక్ హుందాగా ప్రవర్తించుచున్నట్టున్నాడు. కాని అతడు చాలా సరదాగా సంచరించే వ్యక్తి. అందుచేత అతని నవ్వు ఇక్కడ నిలబడివుండడం ప్రత్యేకంగా ఈ పరిస్థితుల్లో ఎబ్బెట్టుగానే ఉంది. లేకపోతే, ఇవానోవిచ్‌కైనా అలాగ అనిపించిఉండి ఉండాలి.

ఆ స్త్రీ లిద్దరు బయలుదేరిన తరవాత ఇవానోవిచ్ కూడా వారివెంట నడిచి, మేడమీదికి వెళ్లాడు. ష్వారెక్ కిందికి దిగకుండా అలాగే ఆ ఉన్నచోటే నిలబడిపోయాడు. అతడు ఆ సాయంకాలంవేళ బ్రిడ్జి ఆడుకోవడానికి చెయ్యవలసిన ఏర్పాటంతా చేస్తున్నాడని ఇవానోవిచ్‌కి తెలిసిపోయింది. ఆ స్త్రీ లిద్దరు ఆ మేడమీద ఇలియిచ్ భార్యఉన్న గదిలో ప్రవేశించారు. ష్వారెక్ ఒక్కసారి మూతివిరిగించి, కనుబొమ్మలు పంకించి, ఆ స్త్రీ లిద్దరికి ఇలియిచ్ మృతశరీరం ఉన్నగది చూపించాడు. అయినా అతని కళ్ళలో ఆ ఖులాసా భావం అల్లాగే మెరుస్తున్నది.

అందరికిమల్లేనే ఆ సమయంలో ఏంచెయ్యాలో తోచక ఇవానోవిచ్ మెల్లిమెల్లిగా లోపలికి వెళ్లాడు. అల్లాంటి సమయాల్లో సిలువమోస్తరుగా చేతులుకట్టుకోవడం మంచిదన్న సంగతి ఒక్కటే అతనికి తెలిసిన విషయం. అయితే ఆ పని నమస్కారపూర్వకంగా చెయ్యాలంటే విషయంలో అతనికి కొంత సందేహం కలిగింది. కనక అతను విషయంలో మధ్యేమార్గం అవలంబించాడు. ఆ గదిలోకి ప్రవేశించగానే సిలువమోస్తరుగా చేతులుకట్టి, నమస్కారధోరణిలో కొంచెం ముందుకు వంగి నడిచాడు. ఆ వంగిన సమయంలోనే వీలైనంతవరకు ఆ గది అంతా వాలుగచూపులా పరిశీలించాడు. ఇద్దరు యువకులు సిలువమోస్తరుగా చేతులు కట్టుకుని ఆ గదిలోనుంచి ఇవతలికి వచ్చేస్తున్నారు. ధోరణినిబట్టి చూస్తే ఇద్దరూ ఇలియిచ్ మేనల్లుళ్ళయి ఉండాలి. వారిలో ఒక యువకుడు హైస్కూలులో చదువుకుంటున్నాడు. అక్కడ ఒక వృద్ధస్త్రీ స్తబ్దంగా నిలబడి ఉన్నది. చిత్రంగా వంగిన కనుబొమ్మలుగల మరిఒక స్త్రీ అతిరహస్యంగా ఆ ముసలావిడ చెవిలో ఏదో ఊదుతున్నది. జమాజెట్టీలా నిటార్గా నిలబడ్డ క్రైస్తవ మతగురువొకడు ఆ దగ్గిరగా నిలబడి ఏదో గట్టిగా చదివి వినిపిస్తున్నాడు. అతని ధోరణినిబట్టి ఆ చదివే విషయానికి తిరుగుండడానికి వీల్లేదన్నట్లుంది. వంటయింటి దగ్గిర పనిచేసే జెరాసిమ్ ఇవానోవిచ్‌కి ఎదురుగా నిలబడి నేలమీద ఏదో పొడి చల్లుతున్నాడు. అది చూడగానే ఇవానోవిచ్‌కి ఆ మృతశరీరం కొద్దికొద్దిగా వాసనకొట్టడం మొదలుపెట్టింది.

చివరకు ఒకసారి చూడడానికి వచ్చినప్పుడు ఇవానోవిచ్ అక్కడ జెరాసిమ్‌ను చూశాడు. ఇవాన్ ఇలియిచ్‌కి అతనంటే ఎంతో ఇష్టం. జెరాసిమ్ అతనికి సకలోపచారాలు చేస్తూ ఒక నర్సులా మసలుకుంటూ ఉండేవాడు. ఆ శవపేటికను, క్రైస్తవ విగ్రహాలను, క్రైస్తవమతగురువులను మధ్యగా నిలబడిన ఇవానోవిచ్ అప్పుడప్పుడు శిలువ మాదిరిగా చేతులు ముడుచుకుని చూస్తూనే ఉన్నాడు, మధ్యమధ్యన తల కొంచెం వంచుతూనే ఉన్నాడు. కాని చేతులు పొడుగుగా చాపడము, ముడుచుకోవడము కొంచెం ఇబ్బందిగా ఉండటంతో అవన్నీ మానివేసి మృతశరీరం పరిశీలించడం ప్రారంభించాడు.

అన్ని శవాల మాదిరిగానే ఇలియిచ్ శవం కూడా శవపేటికలో పరిచిన పరుపుమీద బరువుగా కూలబడినట్లుంది. ఆ శిరస్సు నమస్కారం చేస్తున్నట్టు అల్లాగే తలగడాలో కూరుకుపోయింది.

ఇలియిచ్ కళ్లు లోలోపలికి దించుకుపోయాయి. వాటిమీది కనుబొమ్మలు పచ్చని మైనంముద్దల్లా మారిపోయాయి. వాటిమధ్యమధ్యన కనువెంట్రుక బోడిపోయిన ప్రదేశాలు మచ్చల్లా కనబడుతున్నాయి. మరణించినవారికందరికీ సామాన్యంగా జరిగినట్లుగానే అతని కనుబొమ్మలు కూడా బాగా ముందుకు చొచ్చుకుపోయాయి. ముక్కు పెదవులమీదిమీదికి పోతున్నట్టు బాగా ముందుకు వంగిపోయింది. ఇవానోవిచ్ చివరకు చూసినప్పటికంటె ఇప్పుడా శరీరంలో ఎక్కువ మార్పులు కనబడుతున్నాయి. ఇలియిచ్ ఇప్పుడు బాగా చిక్కిపోయాడు. అయితే మరణించినవారందరిలాగే అతని ముఖం పూర్వంకన్న బాగా అందంగా కనిపించింది. అతని ముఖంలో బతికి ఉన్నప్పటికంటె ఇప్పుడే ఎక్కువ హుందాతనం కనబడుతున్నది. ముఖకవళికల్ని బట్టి చూస్తే సాధించవలసినవన్నీ అనుకున్నట్లుగా సాధించడం జరిగిపోయిందనే భావం గోచరిస్తున్నది. ఇదిగాక, బతికిఉన్న వారందరికీ అతని ముఖంలో ఒకరకం హెచ్చరిక, మందలింపు కూడా కనిపిస్తున్నాయి. ఇవానోవిచ్‌కి ఈ హెచ్చరిక ఏమీ అర్థంలేదని అనిపించింది. ఒకవేళ ఉన్నా అది తనకు సంబంధించినది కాదని అనుకున్నాడు. అక్కడ ఉన్నంతసేపు అతనికి ఊపిరాడనట్టనిపించింది. మళ్ళీ వెంటనే ఒకసారి శిలువ గుర్తుగా చేతులు కట్టుకుని, తనముట్టుకు తనకే అమర్యాద అనిపించినా, అదేమీ లక్ష్యపెట్టకుండా ఒక్క అంగలో ఆ గది దాటి ఇవతలపడ్డాడు.

ష్వార్జ్ కాళ్లు బాగా దూరదూరంగా పెట్టి రెండు చేతులతోను టోపీ ఎగరవేస్తూ ఆ పక్క గదిలో అతని కోసం కనిపెట్టుకుని కూర్చున్నాడు. మాంచి హుషారుగా వేషం వేసుకుని ఖులాసాగా కూర్చున్న ష్వార్జ్‌ను చూడగానే ఇవానోవిచ్‌కి అయుప్రాణాలు లేచివచ్చాయి. ఇల్లాంటి విషాద సంఘటనల విషయం ష్వార్జ్ ఎంతమాత్రము పట్టించుకోడనీ, ఒక విషాద నిశ్వాసమైనా తనను సోకకుండా జాగ్రత్తపడే వ్యక్తి అనీ ఇవానోవిచ్ గ్రహించేశాడు. ష్వార్జ్ ధోరణి చూస్తే ఇలియిచ్ కోసం జరగబోయే ప్రార్థనలు మొదలైన వేవీ అతను తలపెట్టిన ఖులాసా కార్యక్రమానికి ఎంతమాత్రము అడ్డు పడవని తెలిసిపోయింది. అతనా వేళ సాయంత్రం ఒక కొత్తపేక కొని నలుగురు స్నేహితులతోను హాయిగా కాలక్షేపం చెయ్యాలని నిశ్చయించాడు. విజానికీ ప్రార్థనాదికం అతని కార్యక్రమం అడ్డగలదనడానికి అవకాశమే కనబడలేదు. ఇవానోవిచ్‌తో అతనీ విషయం అప్పుడే రహస్యంగా ప్రస్తావించి, స్నేహితులందరు వాసిలోవిచ్ ఇంటిదగ్గర చతుర్ముఖ పురాణం వేసుకోవాలని చెప్పివేశాడు. అయితే ఇవానోవిచ్‌కి అదృష్టం పట్టేటట్టు కనబడలేదు. ఇంతలో ప్రెస్కోవ్యా ఫెడరోవ్నా నఖశిఖ పర్యంతము నల్లని దుస్తులు ధరించి, తన గదిలోనించి ఇవతలికి వచ్చి అక్కడ నిలబడిఉన్న స్త్రీలందరినీ శవం ఉంచిన గదిదగ్గరకు తీసుకువెళ్లి "ప్రార్థన ఇప్పుడే జరుగుతుంది. దయచేసి లోపలికి వెళ్ళండి" అన్నది.

ఫెడరోవ్నా పొట్టిగా లావుగా ఉంటుంది. ఎంత ప్రయత్నించినా ఆమె స్థౌల్యం తగ్గలేదు, సరికదా భుజాలకు దిగువభాగం అంతా క్రమక్రమంగా విస్తరించడం మితిమీరిపోయింది. చివరకు పేర్కొన్న స్త్రీ కనుబొమ్మలలాగే ఆమె కనుబొమ్మలు కూడా ధనురాకారంలో పైకి వంగిపోయాయి. ఫెడరోవ్నా శిరస్సుమీద నల్లని మేలిముసుగు కప్పుకున్నది.

ష్వార్జ్ అంటీ అంటనట్టుగా ఆమెకు నమస్కారం చేసి, ఆమె ఆహ్వానం అంగీకరించడమూ మానడమూ! అన్న ఆలోచనలో అల్లాగే నిలబడిపో

యూడు ఫెడరోవ్నా ఇవానోవిచ్‌ని చూసి, వెంటనే గుర్తించి ఒక నిట్టూర్పు విడిచిపెట్టింది. అటుపిమ్మట అతనికి దగ్గరగా వెళ్లి, చెయ్యి పట్టుకుని "మీరు ఇవాన్ ఇలియిచ్‌కి చాలా ఆత్మీయులు. నాకా సంగతి తెలుసును..." అని అతని ప్రత్యుత్తరం కోసం ఎదురుచూస్తూ నిలబడింది. శవం ఇలియిచ్ ఉన్న గదిలో శిలువ ఆకారంలో చేతులు చాచి ముడుచుకున్నట్లే, ఇక్కడ కూడా యాధాలాభంగా ఏదో ఓదార్పు మాటలు అనాలన్న విషయం ఇవానోవిచ్‌కి తెలుసును. అందుచేత అతను ఆమె చేయి అదిమిపట్టి, ఒక నిట్టూర్పు విడిచిపెట్టి "ఎంత మాట!" అన్నాడు. అతడనుకున్నట్టే జరిగింది. ఇద్దరికీ కళ్లు చెమ్మగిల్లినట్లైంది. అటుపిమ్మట ఆమె "ఒకసారి ఇలాగ రండి! ప్రార్థన మొదలుపెట్టే ముందు మీతో ఒక విషయం మాట్లాడాలని అనుకుంటున్నాను. మీ చెయ్యి ఇలాగ అందివ్వండి" అన్నది. ఇవానోవిచ్ ఆమెకు చెయ్యి అందిచ్చాడు. వారిద్దరు లోపలి గదిలోకి నడుస్తూంటే దారిలో ష్వార్ట్జ్ కనబడి ఇవానోవిచ్ కేసి కన్ను గీటి, అభిజాలిగా అతనికేసి చూశాడు.

ఇవానోవిచ్ దిక్కుతోచనివానిలాగ మరింత జాలిగా నిట్టూర్చాడు. ఫెడరోవ్నా కృతజ్ఞతా భావంతో మళ్ళీ అతని చెయ్యి అదిమిపట్టుకుని, మెల్లిగా లోపలికి నడిపించింది. వారిద్దరు ఒక చిన్న హాలులో ప్రవేశించారు. అక్కడి దీపాలన్నీ కొంచెం మందకొడిగా వెలుగుతున్నాయి. ఆ గదినిండా రకరకాల సోఫాలు, వాటిమీద రంగురంగులదిండ్లు అమర్చబడి ఉన్నాయి. ఆమె ఒక బల్లపక్కగా అమర్చిన సోఫామీద కూర్చుంది. అతను వారక్కనే పట్టు దిండు అమర్చిన మరొక కుర్చీమీద కూర్చున్నాడు. అతడు కూర్చోగానే ఆ దిండు కటాలున లోపలికి దిగబడిపోయింది. అంతకు పూర్వమే ఇంకో కుర్చీలో కూర్చోమని ఆమె అతనితో చెప్పాలని అనుకొన్నదిగాని ఈ ప్రస్తుతపరిస్థితులనుబట్టి అదినంగా అనవసరం కాగలదని మాట్లాడకూరుకుంది. ఆ కుర్చీమీద కూర్చోగానే ఇవానోవిచ్‌కి ఇలియిచ్ ఆ గదిలో ప్రత్యేకంగా చేసిన ఏర్పాట్లు, ఆ పట్టుదిండ్ల అల్లికల విషయంలో తనతో చేసిన సంప్రతింపులు మొదలైనవన్నీ జ్ఞాపకంవచ్చాయి. ఆ గది అంతటా సోఫాలు కుర్చీలు అమర్చబడి ఉన్నాయి. సోఫా మీద కూర్చోడానికి పూర్వం, ఫెడరోవ్నా కప్పుకున్న నల్లని శాలువా అంచు లేసులు ఒక కుర్చీ కొసకు తగులుకుని చిక్కులు పడ్డాయి. ఇవానోవిచ్ ఆ చిక్కులు విడదీయాలని లేచాడు. కాని కూర్చున్న కుర్చీదిండ్లలో అమర్చిన స్ప్రింగు లొక్కసారిగా అతన్ని పైకి నెట్టివేశాయి. ఇంతలోనే ఫెడరోవ్నా లేచి స్వయంగా ఆ లేసు చిక్కులు విడదీసుకోవడం మొదలుపెట్టింది. అందుచేత ఇవానోవిచ్ మళ్ళీ కుర్చీలో కూలబడి ఆ ఊపులో స్ప్రింగు లన్నింటినీ కిందికి అదిమివేశాడు. కాని ఫెడరోవ్నా ఎంత ప్రయత్నించినా ఆ లేసుచిక్కు విప్పలేకపోయింది. అటుపిమ్మట ఇవానోవిచ్ మళ్ళీ లేచి నిలుచున్నాడు. తిరిగీ స్ప్రింగులన్నీ ఉద్రేకంగా పైకిలేస్తూ గట్టిగా చప్పుడు చేశాయి. ఎలాగో ఆ చిక్కులన్నీ తొలగించివేసినతరవాత ఫెడరోవ్నా ఒక తెల్లని చేతిరుమాలుతో ముఖం తుడుచుకుంటూ సన్నగా ఏడవడం ప్రారంభించింది. ఆలాగున లేసు చిక్కుల గొడవవల్ల ఇవానోవిచ్ లోలోపల కొంచెం క్రుంగిపోయి, దిగాలుపడిన ముఖంతో అల్లాగే కూర్చుండిపోయాడు.

సోకోలోవ్ అక్కడికి రావడంవల్ల ఈ దుర్భరపరిస్థితికి కొంత విరామం కలిగింది. అతడు ఇలియిచ్‌దగ్గిర పనిచేసే బంటువాడు. సోకోలోవ్ అక్కడికి వస్తూనే ఇలియిచ్ శరీరం సమాధి చెయ్యడానికి ఏర్పాటుచేసిన స్థలం ఖరీదు రెండువందలవుతుందని చెప్పాడు. దానితో ఫెడరోవ్నా బాగా తేరుకుని, అంత ఖరీదు పెట్టి ఆ స్థలం కొనడం తన తలదాటిపోయిన వ్యవహారమని బాగా బాధపడుతున్న వ్యక్తిలాగ, ఫ్రెంచిభాషలో ఇవానోవిచ్‌తో ఆ విషయం ప్రస్తావించింది. ఇవానోవిచ్ అదంతా జాగ్రత్తగా విని, అందులో అనుకూలమేమీ లేవన్నట్టు తల పంకించాడు.

అటుపిమ్మట ఆమె ఎంతో దీనంగా "ఇదిగో! ఈ సిగరెట్టు ముట్టించండి!" అని చెప్పింది. కాని ఆ కంఠస్వరం బాగా దిగులుపడినట్లు వినబడింది. వెంటనే సోకోలోవ్‌తో సంభాషణలో సమాధికి అవసరమైన ప్రదేశాన్ని గురించి చర్చించడం ప్రారంభించింది.

ఇవానోవిచ్ సిగరెట్టు వెలిగించి ఆ యిద్దరికీ మధ్య నడిచే సంభాషణ అంతా వింటూ కూర్చున్నాడు. ఆమె ఆ సమాధిచేసే ప్రదేశానికి సమీపంలో ఉన్న చెక్కల ధరలన్నీ అడిగి, చివరికి ఏదో ఒకటి నిర్ణయించాలని అనుకుంటున్నది. ఆ తరవాత చర్చిలో జరిగే ప్రార్థనకు కావలసిన సరంజామా అంతా ఏర్పాటుచేసింది. వెంటనే సోకోలోవ్ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

పిమ్మట ఫెడరోవ్నా అక్కడ పడివున్న ఫొటోలన్నీ కదిలిస్తూ "ఈ ఏర్పాటులన్నీ నే

పింఛను సంగతి అడగబోతున్నట్టు కనబడింది. కాని ఆ విషయాలన్నీ తనకంటే వదిరెట్లు బాగా క్షుణ్ణంగా ఆమె కింతకు పూర్వమే తెలుసునని ఇవానోవిచ్ గ్రహించుకున్నాడు. తన భర్త మరణానంతరం తనకు ముట్టవలసిన పింఛను విషయం అంతా ఆమె కింతకు పూర్వమే కరతలామలకంగా ఉన్నది. గాని ప్రభుత్వం దగ్గరనించి ఏమైనా ఇంకా ఎక్కువగా పిండడానికి వీలుంటుందా? అనే ఆమె అతనిని ఈ విషయం కదిలించింది. ఇవానోవిచ్ ఎక్కువగా డబ్బు రాబట్టే ఉపాయాలు కొన్ని చెప్పాడు. గాని మళ్ళీ కొంతసేపు పత్తాయించి, కేవలం మర్యాద కోసం ప్రభుత్వవర్గాల లోభిత్వం బాగా దుయ్యబట్టి, ఇక అంతకంటే రాబట్టడం కష్టమని చెప్పివేశాడు. అటుపిమ్మట ఆమె ఒక నిట్టూర్పు విడిచిపెట్టి అతన్ని వంటనే సాగనంపడానికి తగిన ఉపాయాలు వెదకడం మొదలుపెట్టింది. ఇవానోవిచ్ వెంటనే ఈ సంగతి గ్రహించి సిగరెట్ ముట్టించి, మళ్ళీ సాదరంగా కరచాలనం చేసి, నెమ్మదిగా పక్కగదిలోకి తప్పుకున్నాడు.

ఆ భవనం భోజనాలగది గోడమీద ఒక గడియారం కనబడుతుంది. ఆ గడియారం అంటే ఇలియిచ్ కెంతో ఇష్టం. అది వది ఒక ప్రాచీనవస్తువుల దుకాణంలో కొని ఆ గోడకు తగిలించాడు. ఇవానోవిచ్ కక్కడ ఒక మతగురువు, కొంతమంది పరిచితులు కనిపించారు. వారందరు ప్రార్థనకోసం అక్కడికి చేరుకున్నారు. అతనికి వారిలో ఇలియిచ్ కుమార్తె కూడా కనబడింది. ఆమె చక్కని చుక్క. సన్నగా నాజూకుగా ఉన్న ఆమె శరీరం నల్లని దుస్తులవల్ల మరింత నాజూకుగా మారింది. ఆమె బాగా దిగులుగా ఉంది. ఎవరిమీదనో కోపగిస్తున్నట్టు, ఏదో ఒక పని చెయ్యాలని నిశ్చయించినట్లు కనబడింది. ఇవానోవిచ్‌ని చూడగానే అతనే తన తండ్రి మృత్యువుకు కారణం అన్నట్లూ విసుగుగా అతని వైపు తిరిగి నమస్కరించింది.

ఆమె వెనకాల ఇంచుమించుగా ఇల్లాంటిధోరణిలోనే, ఉన్నమరి ఒక యువకుడు కనిపించాడు. అతను బాగా ధనవంతుడు. ప్రస్తుతం మేజిస్ట్రేటు ఉద్యోగం [illegible] ఇవానోవిచ్‌కి అతను పరిచితుడే. ఇలియిచ్ కుమార్తెకు, అతనికి వివాహం స్థిరపడింది. ఇవానోవిచ్ విచారంగా వారిద్దరికీ నమస్కరించి, ఇలియిచ్ శరీరం ఉంచిన గదిలోకి వెళ్ళబోతూంటే మళ్ళీ ఇంకొక పిల్లవాడు కనిపించాడు. అతను ఇలియిచ్ కుమారుడు. బళ్ళో చదువుకుంటున్నాడు. ఆ కుర్రవాడు ముమ్మూర్తులా ఇలియిచ్‌ని పోలి ఉన్నాడు. అతనివైపు చూస్తూంటే మళ్ళీ ఇలియిచ్ చిన్నపిల్లవాడై తిరుగుతున్నాడా అనిపించింది. తన చిన్నతనంలో ఇలియిచ్ అచ్చం ఇలాగే ఉండేవాడని ఇవానోవిచ్ అనుకున్నాడు. పదిపదమూడేళ్ళు వచ్చేసరికే పిల్లల కళ్ళలో ఒక విధమైన అపవిత్రత కనిపిస్తుంది. కన్నీళ్ళు చారికలుకట్టిన ఇలియిచ్ కుమారుని కళ్ళలో కూడా అలాంటికళే కనిపించింది. ఇవానోవిచ్‌ని చూడగానే ఆకుర్రవాడు మూతి బిగించుకొని ముఖం తిప్పివేసుకున్నాడు.

ఇవానోవిచ్ అతన్ని పలకరించినట్లుగా తలపంకించి మృతశరీరం ఉంచిన గదిలోకి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళి వెళ్ళడంతోనే ప్రార్థన ప్రారంభం అయింది. ఆ గదిలో కొన్ని కొవ్వొత్తిదీపాలు వెలుగుతున్నాయి. సాంబ్రాణిపొగ గది నాలుగుమూలలా వ్యాపిస్తున్నది. ప్రార్థనల మధ్యన మూలుగులు, నిట్టూర్పులు, ఏడుపులు, వినిపిస్తున్నాయి. దిగులుగా తన పాదాలకేసి చూస్తూ ఇవానోవిచ్ అల్లాగే నిలబడిపోయాడు. అంతేగాని మళ్ళీ ఇలియిచ్ శరీరంవైపు చూడలేదు. తరవాత చీకు, చింతా మనస్సులో ప్రవేశించకుండా నిబ్బరంగా ఉండి, అందరికంటే ముందుగానే ఆ గదిలోనించి ఇవతలికి వచ్చేశాడు. ఆ పక్కగదిలో ఎవ్వరు లేరు. కాని జెరాసిమ్ ఆ ఇలియిచ్ శరీరం ఉంచిన గదిలోనుంచి వెంటనే ఇవతలికి వచ్చి, తన నాటుచేతులతో అక్కడ తగిలించిన ఉన్నికోటులన్నీ తడిమిచూసి, అందులో ఇవానోవిచ్ కోటు పట్టుకుని, అతనా కోటు తొడుక్కుంటూంటే వెనక నిలబడి సాయం చేశాడు.

ఏదో ఒక మాట అనాలిగదా అని ఇవానోవిచ్ అతనితో ఇలాగ అన్నాడు "నేస్తం! చూశావా! పాపం! ఎంత అవస్థ వచ్చిందో!"

జెరాసిమ్ "అది అంతా భగవంతుడి దయ బాబూ! ఈయాలో రేపో మనమంతా అక్కడికి వెళ్ళాలి గందా బాబూ!" అన్నాడు. జెరాసిమ్ ఆ మాట అంటూంటే అతని తెల్లని పళ్ళవరస బైట పడింది. అది ఆరోగ్యంగా జీవించే రైతు పళ్ళవరస. ఈ మాట అన్న తరవాత జెరాసిమ్ ఊపిరాడని పనితో కొట్టుకుంటూన్నవాడిలాగ ఎదురుగా నిలబడిన స్లెడ్జిబండి తలుపులు తెరిచి, ఇవానోవిచ్‌ని అందులో ప్రవేశపెట్టి, ఏదో ఇంకొక తొందరపనికోసం వెళ్తున్నవాడిలాగ గుమ్మందాటి లోపలికి ఒక్క గంతు వేశాడు.

ఆ సాంబ్రాణిపొగ, ఆ శవం, ఆ వాసన, మొదలైన వాటినించి తప్పించుకొని ఇవతలపడ్డ తర

వాళ వీధిగారి పోగానే ఇవానోవిచ్‌కి పంచ ప్రాణాలు లేచివచ్చాయి

బండివాడు "ఎక్కడికి తోలమన్నారు బాబూ!" అని అడిగాడు

ఇవానోవిచ్ "ఇప్పుడైతే ఇంకేం! మించిపోయిందేమీ లేదులే! ఫెడర్ వాసిలోవిచ్ ఇంటివైపు పట్టించు" అన్నాడు

బండి అక్కడికి వెళ్లి ఆగింది ఇవానోవిచ్ లోపల ప్రవేశించేసరికి బ్రిడ్జిఆట ఒక ఘట్టం అయింది వెంటనే ఇవానోవిచ్ ఒక ఆటగాడిని జబ్బ పట్టుకుని లేవదీసి ఆ ఆటలో పడ్డాడు

## 2

ఇవాన్ ఇలియిచ్ బ్రతుకంతా చాలా సంసార పక్షంగాను, సరళంగాను గడిచిపోయింది కనకనే అది అత్యంత భయంకరమైన జీవితం

అతడు కోర్టులో జడ్జీగా పనిచేసేవాడు, 45వ ఏట చనిపోయాడు అతని తండ్రి ఒక పెద్దఉద్యోగంలో ఉండేవాడు పీటర్స్‌బర్గ్‌లో అనేకమైన ప్రభుత్వశాఖల్లో చాలాకాలం పనిచేసిన తరవాత అతనికొక పెద్ద హోదావచ్చింది సామాన్యంగా చాలాకాలం ఉద్యోగాలుచేసి గొప్ప హోదాల్లోకి వచ్చిన మనుషుల్ని - ఇలాంటి పదవులు నిర్వహించ డానికి ఏ కొంత అసమర్థులయినా—చటుక్కున బర్తరఫ్ చెయ్యడం చాలా కష్టం అందుచేత ఇలాంటి వాళ్ళకోసం కొత్తగా కొన్ని ఉద్యోగాలు సృష్టిస్తారు. వీటికి అయిదారు వేలదాకా జీతాలుంటాయి ఈ ఉద్యోగాలు కేవలం ఆ సామాన్య ఉద్యోగాలే కావచ్చునుగాని, ఈ ఉద్యోగులు స్వీకరించే, జీతాలుమాత్రం చాలా గట్టివి ఇలాంటి జీతాలు తీసుకుంటూ వీరంతా చిరకాలంపాటు జీవిస్తారు

ఇలాంటి పెద్దపెద్ద అనామకీ ఉద్యోగాలెన్నో చేసిచేసి, చివరికి ప్రివికౌన్సిలరైన ఇల్యా ఎపిమోవిచ్ గోల్విన్ జీవితగాథ అంతటిది!

అతనికి ముగ్గురు కుమారులు వీరిలో ఇవాన్ ఇలియిచ్ రెండవవాడు పెద్దవాడు ఇంకొక ప్రభుత్వ శాఖలో కేవలం తండ్రి అడుగుజాడల్లోనే నడిచి పోతున్నాడు; అప్పుడే అతను కూడా తండ్రి మోస్తరుగానే పనిపాటూలేని పెద్దఉద్యోగం ఒకటి అందుకోబోతున్నాడు మూడోకుమారుడికి ఎక్కడికి వెళ్ళినా పెద్దమొక్క ప్రత్యక్షమయింది ఎన్నో పెద్ద ఉద్యోగాలు దొరాడుగాని చివరికి అన్నింటిలోను పట్టిచేతగానివా డనిపించుకున్నాడు; ప్రస్తుతం రైల్వేలోపని చేస్తున్నాడు అతని తండ్రి, సోదరులు వారి భార్యలు—అతన్ని చూస్తూనే దూరదూరంగా తప్పుకుపోవడమేకాక, ఏదో అత్యంతావసరంతప్ప అతడు బతికున్నాడన్నమాటే మరిచిపోయేవారు అతని సోదరి బారన్ గ్రెఫ్ అనే పీటర్స్‌బర్గ్ ఉద్యోగిని వివాహంచేసుకున్నది ఇతడు కూడా ఈమె తండ్రితో సమానమైన హోదాలో ఉన్న ఉద్యోగస్థుడే ఇక మన ఇవాన్ ఇలియిచ్ కుటుంబానికి పరువుప్రతిష్ఠలు తీసుకువస్తాడని అందరు అంటూండేవారు ఇతడు అన్నగారిలాగ అందరికీ దూర దూరంగాను ఉండలేదు, తమ్ముడిలాగ అయినవాళ్ళతోను, కానివాళ్ళతోను కలిసి తిరగనూలేదు కాని ఇద్దరికీ మధ్యమార్గంలో మసులుకుంటూ ఉండేవాడు తమ్ముడితో కలిసి న్యాయకళాశాలలో చదివాడు తమ్ముడు చదువు పూర్తిచెయ్యలేక పోయాడు 5వ సంవత్సరంలో కళాశాలాధికారులతన్ని బర్తరఫ్‌చేసి బయటికి పంపించి వేశారు ఇలియిచ్ బాగా చదివి, పరీక్షలన్నీ గడిచి గట్టెక్కాడు

ఆ తరవాత అజన్మాంతము కనబడిన ఆ ధోరణి అంతా అతనికి ఆ చదువుకునే రోజుల్లోనే అలవాటయింది ఇలియిచ్ సమర్థుడు అందరితో కలిసి మెలిసి తిరుగుతూ మంచి ఉత్సాహంగా ఉండేవాడు తన ఉద్యోగవ్యవహారాలన్నీ బాగా నిక్కచ్చిగా నడిపిస్తూ ముక్కుకు సూటిగా వెళ్ళిపోతూండేవాడు తన విధులన్నీ సక్రమంగా నిర్వహించేవాడు, అయితే పై అధికారులంతా ఇది న్యాయం అనుకుంటే ఇతను కూడా గిరిగీసినట్టుగా అల్లాగే నడిచిపోయేవాడు చిన్నతనంలోగాని, పెద్దతనంలోగాని అతనికి ఇచ్చకాలు మాట్లాడే అలవాటు ఉండేదికాదుగాని, దీపంచుట్టూ పురుగులు చేరినట్లు పెద్దపెద్ద ఉద్యోగస్థులంటే బాగా ఆప్యాయత కనబరుస్తూండేవాడు వారి జీవిత దృక్పథాలు, ఆచారవ్యవహారాలు మొదలైనవన్నీ బాగా ఆకళించుకుంటూ వారితో స్నేహంచేస్తూండేవాడు చిన్నతనంలోను ఆ తరవాత వయస్సులోను ఉండే ఆదర్శాలు, ఉత్సాహాలు మొదలైనవన్నీ అవ వాలైనా లేకుండా హరించిపోయాయి క్రమంగా శ్రీవ్యసనానికి, దానధర్మాలకు దాసుడైపోయాడు బాగా పెద్దఉద్యోగస్థులతో కలిసి తిరిగేటప్పుడు ఏది పడితే అది చేయవచ్చునని సునిశాల దృక్పథంతో మాట్లాడుతూండేవాడు. కాని సహజంగా తన హృదయానికి న్యాయమని స్ఫురించిన పరిమితుల్లోనే వ్యవహరిస్తూ, ఎప్పుడూ జాగ్రత్తగా మసులుకుంటూండేవాడు.

నిలబెట్టుకుంటూ జాగ్రత్తగా కాలక్షేపం చేసేవాడు ఇలియిచ్‌కి వెనక ఉద్యోగంకన్న ఈ ఉద్యోగమే బాగా నచ్చింది వెనకటి ఉద్యోగంలో పెద్దపెద్ద దర్జీలు కుట్టిన విలువైన దుస్తులు వేసుకుని గవర్నరు దర్బారు చేసి ఉన్న పదులకొలది అర్జీదారుల మధ్యనుంచి నడిచిపోతూండడం చాలా దర్జాగా ఉండేది ఠీవిగా నడిచిపోతూ ముఖ్య ముఖ్య గవర్నరులతో కలిసి పేకాట్లు, ఫ్రెంచి ఖులాసాగా కబుర్లు చెబుతూ అధికారం చెలాయించే అతన్ని చూసి అర్జీదారులందరూ అసూయ పడుతూ ఉండేవారు అయితే ఎవరో పోలీసు ఉద్యోగులకు, కులకత్తులవివాదాలు తీర్చ మరికొంతమందికి మాత్రమే అతని అవసరం కావలసివచ్చేది ఇలియిచ్ వారిందరినీ చాలా మర్యాదగానే ఆదరిస్తూ ఉండేవాడు తలుచుకుంటే కాలికింద పెట్టి నలిపే పెత్తనగల శక్తిసామర్థ్యాలున్నా 'మిమ్మల్నీ అందరినీ ఎంతో మర్యాదగా గౌరవిస్తున్నాను సుమా!' అన్నట్టుగా అతి నాజూకుగా అందరితోను వ్యవహరిస్తూ ఉండేవాడు అయితే ఎంత చూసినా అలాంటి మనుష్యులా రోజుల్లో చాలా తక్కువగానే ఉండేవారు కాని మేజిస్ట్రేటు గిరీ వచ్చిన తరవాత కొమ్ములు తిరిగిన పెద్దపెద్ద అధికారులంతా అతనికి గుప్పిట్లో ఉన్నట్టుండేది ఒక కాగితంమీద నాలుగు గీతలు గీస్తేచాలు ఎంతెంతటి అధికారులైనా ముద్దాయిలో, సాక్షులో అయి, చేతులు కట్టుకుని అతని ఎదుటగా హాజరు కావలసిందే అలా హాజరై, అతను కూర్చోమనేదాకా అలా నిలబడి ఉండి, అతడడిగిన ప్రశ్నలకు సమాధానాలివ్వవలసిందే అయితే ఇలియిచ్ మాత్రం తన అధికారం దుర్వినియోగపరచలేదు పైపెచ్చు చాలా చల్లగానే కబుర్లు చెబుతూ ఉండేవాడు అందుచేత అతని కచేరీ అంటే అందరు అనాకలింతగా చెప్పుకునేవారు కేసులు విచారణ చేసే సందర్భాలలో కూడా అనవసరమయిన బాదరబందీ అంతా తీసేసి, తన ఇష్టానిష్టాలొకపక్కకు కొట్టి, కేవలం లా ప్రకారం ముక్కుకు సూటిగా వెళ్లిపోతూ ఉండేవాడు 1864 లో కొత్తగా నూతన న్యాయసూత్రాలమలులోకి వచ్చాయి ఆ పనిఅంతా కొత్తగా ఉన్నా, ఇలియిచ్ అన్నిట్నీ అమలులో పెట్టి నడిపించుకుపోయాడు

ఇలా మేజిస్ట్రేటు గిరీ చెలాయిస్తుండగా అతన్ని ఇంకొక పట్టణానికి బదిలీ చేశారు. అక్కడ అతను కొత్తకొత్తవారితో పరిచయాలు ఏర్పరచుకుని, కొత్త బంధుత్వాలు కలుపుకున్నాడు ఇప్పుడు ఒక రకం కొత్తతీరు అవలంబించి, భార్యతో ధోరణులంతా చాలావరకు తగ్గించివేశాడు. ఆ ప్రాంతంలో అధికార వర్గానికి కొంతవరకు దూరదూరంగా ఉంటూ, వారందరిమీదల ఒకరకమైన దర్జా కనబరుస్తూ ఉండేవాడు పెద్దపెద్ద న్యాయవాదులతోను చెబుతున్న వారితోను కొత్తగా కలిసిమెలిసి తిరుగుతూ, అప్పుడప్పుడు ప్రభుత్వం వ్యవహారాలు సరియైన దారిలో నడవడంలేదని విమర్శించేవాడు

ప్రజలకు స్వాతంత్ర్యాలు, హక్కులు ఇంకా కొంచెం ఎక్కువ చెయ్యాలని అంటూండేవాడు ఇది ఇల్లాగ సాగుతున్నా తన దేవభావమేమీ తక్కువ చేసుకోలేదు,' కొంచెం హుషారుకోసమని గడ్డం కూడా పొడుగా పెరగనిచ్చాడు

ఇలియిచ్ ఈ కొత్తపట్టణానికి వచ్చిన తరవాత కొంతకాలానికి సుఖంగా తన ఉద్యోగంలో కుదురుకున్నాడు ఆ పట్టణంలో పెద్దపెద్ద ఉద్యోగస్థులందరికీ అక్కడి గవర్నరంటే అంతగా పడేది కాదు, అందుచేత వారందరు ఇతనంటే ఎంతో ఆప్యాయత కనబరచేవారు జీతం కూడా పెద్దదయింది ఈ రోజుల్లో ఇలియిచ్ ఒక కొత్తరకం బ్రిడ్జి ఆట ఆడుతూండేవాడు దీనితో అతనికి మరీ సుఖంగా కాలక్షేపం అయిపోతూండేది పైకి ఖులాసాగా అనుకున్నట్టున్నా, ప్రత్యేకశక్తి సామర్థ్యం ఉండడంవల్ల క్షణకాలంలో జాగ్రత్తగా లెక్కలుకట్టి సామర్థ్యంగా ఆ ఆటలన్నీ తనే గెలుచుకుపోతూ ఉండేవాడు

ఈ పట్టణంలో రెండు సంవత్సరాలున్న తరవాత ఇవాన్ ఇలియిచ్ ముందు వివాహమాడబోయే యువతితో పరిచయం కలిగింది ఆమె పేరు ప్రస్కోవ్యా ఫెదరోవ్నా మిఖేల్ అతనికి పరిచయం అయిన అమ్మాయి లందరిలోను ఆమె చాలా అందగత్తె మంచి తెలివితేటలున్నాయి, ముఖ్యంగా నవ్విల్ల తీరిక సమయాల్లో ఆమెతో కొత్తగా తిరుగుతూండడం-ఇప్పుడతనికి ఇతరవ్యాపకాలతో పాటొక వ్యావృత్తిగా తయారయింది కార్యం గవర్నరు దగ్గర ప్రత్యేకోద్యోగిగా పనిచేసేటప్పుడతనికి అప్పుడప్పుడు నృత్యం చేసే అలవాటుండేది ఇప్పుడయితే ఏదో ప్రత్యేక సమయంలో తప్ప అది జరగడంలేదు అధికార పద్ధతుల్లో సరికొత్తమార్పులు వచ్చినా, పెద్దపెద్ద అధికారాల్లో అయిదో అంతస్థులో ఉన్నా, అవసరంవస్తే అందరికన్నా బాగా బాగా నృత్యం చెయ్యగలనని అనిపించుకోవడంకోసమే, అతడప్పుడప్పుడు నృత్యవినోదాల్లో పాల్గొనేవాడు. అందుచేతనే అప్పుడప్పుడు నృత్యాదివినోదాల చివరరోజుల్లో ప్రస్కోవ్యా ఫెదరోవ్నాతో కలిసి నృత్యం చేస్తూండేవాడు ఈ సందర్భంలోనే ఫెదరోవ్నా కళ్లు అతనిమీద పడ్డాయి. ఆమె అతన్ని

మానివేసి ఆ ఆఫీసుకే అంటిపెట్టుకుని ఉండిపోయేవాడు అదేపనిగా ఆఫీసుపని అంటేనే అతనికి ప్రాణాలు లేచివచ్చేవి అందుచేత ఆపని అంటే చెరిగిపోకుండా చూసుకుంటూ, అందులోనే గాలిమేడలు కట్టుకుంటూ ఉండేవాడు

కొద్దిరోజులు తీరికగా గడిచిపోయేసరికి, వివాహజీవితంలో కొన్ని స్వల్పసౌఖ్యాలున్నా, ఈ విధంగా సంసారం ఈదడం చాలా ప్రయాసతో కూడుకున్న పని అనీ, నలుగురిలోను మర్యాదగా కాలక్షేపం చేస్తూ సంసారం సాగించాలంటే ఆఫీసు వ్యవహారాల్లోలాగే ఇంటి వ్యవహారాలలో కూడా ఒక ప్రత్యేక దృక్పథం అలవరచుకోవాలనీ అతను ఒక నిశ్చయానికి వచ్చాడు

అదివరకైన దృక్పథానికి అలవాటుపడ్డాక ఇప్పుడతని కింటిదగ్గర కావలసినవి కొన్ని సామాన్య సౌకర్యాలు మాత్రమే. మధ్యాహ్నంవేళ సుఖంగా ఇంటిపట్టున భోజనము, ఇంటికి వచ్చేసరికి ఏ సౌఖ్యానికీ లోటురాకుండా అమరణము కనిపెట్టుకుని ఉండే ఇల్లాలు—ఇవే అతనికి కావలసినవి. ఆపైన నలుగురిలోను గౌరవమర్యాదలకు లోటులేకుండా జీవితం చల్లగా సాగిపోతూండాలి కదా! ఇలియిచ్‌కి ఈ సంసారసౌఖ్యాలన్నీ అమరుతూనే ఉన్నాయి అతనింక మిగిలిన అన్ని విషయాలలోను మర్యాదా లోపం లేకుండా ఖులాసాగా కాలక్షేపం చేస్తూ, నవ్వుతూ తేలుతూ ఉండేవాడు దీనికి ఇంటిలో కూడా తగినంత ఆసరా ఉంటే సరేసరి లేక రుసరుసలు, సాధింపులు ప్రారంభం అయినట్టు కనబడితే ఆఫీసుపని అనే ఒక ప్రత్యేక ప్రపంచంలో ప్రవేశించి, తలుపులు బిగించుకొని కూర్చుని సుఖంగా కాలం గడిపేవాడు

ఇవాన్ ఇలియిచ్ ఆ ప్రాంతంలో అంతటా చాలా మంచివాడనే పేరు సంపాదించాడు ఇల్లాగ మూడేళ్లు గడిచిన తరవాత ఇలియిచ్ అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటర్ అయ్యాడు దీనితో ఆఫీసులో పని ఎక్కువయింది; హోదా కూడా బాగా పెరిగింది ఇప్పుడు ఎలాంటి అధికారులనైనా తన ఎదట నిలబెట్టేట్లు చెయ్యగల అధికారం అతనికి హస్తగతం అయింది ఇలియిచ్ ఇప్పుడే విషయాన్ని గురించి మాట్లాడినా వెంటనే అది పెద్ద పెద్ద అక్షరాలతో పేపర్లలో అచ్చుపడుతూంది అతని పేరు ప్రఖ్యాతులు బాగా వ్యాపించాయి. ఇలా జరుగుతున్నకొద్దీ అతని కా ఆఫీసు వ్యవహారాలమీద మరింత బాగా మోజు పెరిగింది.

ఈలోగా ఇంకా కొంతమంది పిల్లలు బయలుదేరారు దీనితోపాటు భార్య రుసరుసలు, సాధింపులు కూడా మితిమించిపోయాయి. ఇంటి వ్యవహారాల విషయంలో అతను అవలంబించిన వైఖరివల్ల ఆమె సాధింపులు అన్నీ అతని చెవిని పడడమే మానివేశాయి

ఇలాగ ఏడేళ్ళు పబ్లిక్ ప్రాసిక్యూటరుగా పని చేసిన తరవాత అతన్ని ఇంకొకచోటికి బదిలీ చేశారు కుటుంబం అంతా కొత్తచోటికి వెళ్లారుగాని ఆ రోజుల్లో ఇలియిచ్‌కి బాగా డబ్బునిక్కచ్చి పట్టుకుంది అదీ గాక ఫెదరోవ్నాకి కొత్తచోటికి బదిలీ కావడం సుతరామూ ఇష్టంలేదు జీతం పెరిగినా సంసారం ఖర్చులు కూడా అంతకంటె పదిరెట్లు పెరిగిపోయాయి ఇది ఇల్లాగ ఉండగా ఇక్కడికి వచ్చిన తరవాత ఇంకొక ఇద్దరు పిల్లలుకూడా పోయారు. దానాదీనా ఇలియిచ్‌కి సంసారం మరీ దుర్భరం అయిపోయింది

ఇక్కడ కొత్తఇంటికి మారినతరువాత ఫెదరోవ్నా ప్రతి చిన్న ఇబ్బందికి ఇలియిచ్చే కారణమని అతన్ని దులిపివేస్తూండేది భార్యాభర్తలు ఏదైనా సంభాషణ ప్రారంభించేసరికి క్రమంగా అది పిల్లలచదువులోకి దిగుతూండేది ఆ ప్రస్తావనలో వారి పూర్వపు తగాదాల విషయాలుకూడా దొర్లుతూండేవి ఇంక ఆ తగాదాలమాట ఎత్తితే ఎక్కడో అక్కడ హఠాత్తుగా ఆ ఇద్దరిమధ్యా అంటుకోవడం తప్పదన్నమాటే! ఇక పడకగదిలో ప్రవేశించిన తరవాతమాత్రం ఇద్దరూ ఆప్యాయంగా మాట్లాడుకొనే వారుగాని, ఆ సమయాన్నైనా ఆట్టే కాలం ఉండేవి కావు అడపా తడపా ఒక ద్వీపంమీద ఉన్నట్టు ప్రశాంతంగా ఉండి, మళ్లీ మరుక్షణంలోనే వారిద్దరు ఆ భయంకర జీవితసాగరయాత్ర సాగిస్తూ నిత్యము ఎడమొహము పెడమొహము పెట్టుకుంటూ ఉండేవారు

ఇల్లాగ ఉండడం తప్పు అని తోస్తే ఇలియిచ్ బాగా బాధపడి ఉండేవాడే కాని అతడిది సహజమే అనుకున్నాడు మరికొంతకాలానికి సంసారం ఇల్లాగే నడిపించాలని కూడా నిశ్చయించుకున్నాడు క్రమంగా తానా సంసారపు గొడవలకు దూరంగా ఉండాలనీ, పైపై మర్యాదలకు భంగం రాకుండా ఉంటే చాలునని సరిపెట్టుకున్నాడు అందుచేత ఇలియిచ్ తన కాలం అంతా చాలావరకు ఆఫీసులోనే గడిపివేస్తూండేవాడు. ఇక ఇంటికి రావడం తప్పనిసరి అయినప్పుడు ఎవరినైనా వెంటపెట్టుకొని వచ్చి, వాళ్ళు ఇంటిలో ఉండడంవల్ల తన పరువు మర్యాదలకు భంగం రాకుండా కాపాడుకునేవాడు. ఏదైనా ఎంతసేపూ అతని దృష్టి ఆ ఆఫీసు వ్యవహారాల

హాజే ఉంటేది. చివరికి అతనికి అదొక్కటే లోకమయిపోయింది. రాత్రింబగళ్లూ ఆఫీసుపనిలో మునుగుతూ ఉంటూ ఉండడమే అతనికి సుఖం అనిపించింది. ఇప్పుడతనికి శాఖలో గొప్ప అధికారిగానే భావం బాగా పాతుకుపోయింది. ఎలాంటి వ్యక్తినైనా ఇలియిచ్ ఇప్పుడు ఒక్క క్షణంలో అథఃపాతాళానికి తొక్కి వెయ్యగలడు. కోర్టులో ప్రవేశించేటప్పుడు అతనికిచ్చే పారా హుషారులు, ప్రత్యేక మర్యాదలు, తన కంటె తక్కువతరహా ఉద్యోగస్థులతో మాట్లాడేటప్పుడు వారు ప్రదర్శించే వినయ విధేయతలు, పెద్ద అధికారులు, చిన్న అధికారులు కూడా చెప్పినదానికల్లా తలలూపుతూండడము, కేసులు పరిష్కరించడంలో కనపరిచే శక్తి సామర్థ్యాలు, తోటివారితో కాలక్షేపాలు, విందులు, పేకాటలు మొదలైన సమస్త విషయాలతోను అతని కాలజీవితం అంతా హాయిగా గడిచిపోతున్నట్లనిపించేది. మొత్తంమీద ఇలియిచ్ కోరుకున్నట్టుగా జీవితం అంతా అలాగే సరదాగాను, మర్యాదగాను గడిచిపోతూండేది.

ఈ మోస్తరుగా ఇలియిచ్ జీవితం ఏడు సంవత్సరాలకాలం సాగిపోయింది. అతని పెద్దకూతురుకప్పుడే 16 వ ఏడు వచ్చింది. ఈలోపుగా ఇంకొక కుర్రవాడు జారిపోయాడు. ఇక మిగిలిన వాడొక్కడే. ఇతని విషయంలో భార్యాభర్తలిద్దరి మాట కలవలేదు. ఇలియిచ్ ఈ కుర్రవాణ్ణి లాస్కూల్లో చేర్పాలని అనుకున్నాడు కాని, ఫెదరోవ్నా కేవలం అతని మాట కాదనడానికని వాణ్ణి హైస్కూల్లో చేర్పించింది. ఆడపిల్లకి ఇంటిదగ్గరే చదువు చెప్పించారు. ఆ పిల్ల చదువు బాగానే సాగింది. మొత్తంమీద ఆ పిల్లవాడి చదువు కూడా బాగానే సాగిందని చెప్పవచ్చును.

## 3

వివాహానంతరం 17 ఏళ్ళవరకు ఇవాన్ ఇలియిచ్ జీవితం అంతా ఈవిధంగా గడిచిపోయింది. అతనిప్పుడే చాలాకాలంనించి పబ్లిక్ ప్రాసిక్యూటరుగా పనిచేస్తున్నాడు. అధికార్లతన్ని అనేకసార్లు బదిలీ చేస్తామన్నారుగాని ఉన్నదానికంటె మరొక మంచిఉద్యోగం రాగలదనే ఆశతో ఇలియిచ్ దానికి ఇష్టపడలేదు. ఇంతలో ఒక కష్టంవచ్చి, హాయిగా గడిచిపోయే అతని జీవితంఅంతా తారుమారు చేసివేసింది. విశ్వవిద్యాలయం ఉన్న ఒక పట్టణంలో ప్రధానన్యాయాధికారి ఉద్యోగం ఈతనికిస్తారని ఇలియిచ్ చాలాచాలా ఉవ్విళ్లూరాడుగాని, చివరికి హాప్ అనే వ్యక్తి ముందుకు తోసుకువచ్చి, ఆ ఉద్యోగం కాస్తా తన్నుకుపోయాడు. దీనితో ఇలియిచ్ బాగా చిరాకుపడి, హాప్ మీద, తన పైఅధికారులమీద నానామాటలుఅని, వారితో దెబ్బలాట పెట్టుకున్నాడు. దానితో ఆ అధికారులితన్ని ఒక మూలకు నెట్టివేశారు. ఇల్లాంటిదే ఇంకొక ఖాళీ వచ్చిందిగాని ఆ అధికారులదికూడా ఇంకొకరికి ఇచ్చివేశారు.

ఇది 1880 లో జరిగింది. ఇలియిచ్ జీవితంలో ఇలాంటి పాడుసంవత్సరం ఎన్నడూ రాలేదు. తనకిచ్చే జీతం చాలలేదన్న విషయం ఆ ఏడంతా అతనికి మాటి మాటికి స్ఫురిస్తూనే ఉంటేది. అసలైన అధికారులు తనమాటే మరిచిపోయారన్నది కూడా స్పష్టపడిపోయింది. ఇంతే గాదు; తనజీవితం అంతటిలోను ఇంతటి ఘోరమైన అన్యాయం జరగలేదని అతను బాధపడుతూంటే, మిగిలినవారందరు అది సర్వసామాన్యంగా జరిగేవిషయమేనని ఆ గొడవే పట్టించుకోవడం మానివేశారు. ఆఖరికి తండ్రికూడా అతనికి సహాయం చెయ్యాలనే తలపెట్టలేదు. ఇవాన్ ఇలియిచ్ ఇక తన మాటంటే ఎవ్వరు చెవిని పెట్టడమే మానుకున్నారని అనుకున్నాడు. ఇది ఇలాగ ఉండగా నెలకు మూడువేల అయిదు వందలిస్తూంటే చాలదా! అని, నిజంగా ఇలియిచ్ అదృష్టవంతుడేనని అందరు అంటూండేవారు. తనకు ఘోరమైన అన్యాయం జరిగిందని ఇలియిచ్ ఎప్పుడు లోలోపల కుములుతూండేవాడు; అసలైన ప్రతి రోజు భార్య సాధించిపోస్తూనే ఉంది, దానిమీద ఇలియిచ్ కూడా తలకు మించిన అప్పులుచేస్తూ దుబారాగా ఖర్చుచేస్తూండేవాడు, వీటి అన్నిటివల్ల అనుభవించేయాతన ఇలియిచ్ కి తప్ప ఇంకెవరికి తెలుస్తుంది?

ఎలాగైనా కొంత డబ్బు ఆదా చెయ్యాలనే ఉద్దేశంతో ఇలియిచ్ ఆ సంవత్సరం వేసవిలో సెలవు పెట్టి, భార్యతోసహా బావమరది ఇంటికి వెళ్లాడు. అక్కడికి వెళ్ళిన తరవాత జీవితంలో మొట్టమొదటుగా అతనికి నిస్పృహ, విసుగుదల అంటే ఏమిటో తెలిశాయి. ఇంతేగాదు; ఇంకా కొన్ని రోజులయ్యేసరికి అతనికి దిగులు, బెంగ కూడా పట్టుకున్నాయి. ఆ తరవాత ఇంక ఈవిధంగా జీవితం సాగించడం సాధ్యపడదని, దీనివిషయంలో గట్టిగా పనిచెయ్యాలని అతను నిశ్చయించుకున్నాడు.

ఇలియిచ్ ఒకనాడు రాత్రిఅంతా మేలుకుని వరండాలో అటూఇటూ పచారుచేస్తూ, ఒకసారి పీటర్స్‌బర్గ్ వెళ్ళి తాను చేసినపని గుర్తించలేని పై ఉద్యోగస్థులందరికీ శాస్తి చెయ్యాలని, ఎలాగైనా మరి ఒక ప్రభుత్వశాఖలోకి బదిలీ చేయించుకోవాలని స్థిరపరచుకున్నాడు.

ఇలియిచ్ ఆ మర్నాడు పొద్దున్నే లేచి బావమరిది, భార్య తల్లిని ఎంత పోరినా విడిచిపెట్టకుండా, ఎల్లాగో అల్లాగ ఏదో ఒక ప్రభుత్వశాఖలో నెలకు అయిదువేలువచ్చే ఉద్యోగం సంపాదించే ప్రయత్నంమీద పీటర్స్‌బర్గ్‌కు ప్రయాణమైనాడు. అతని కిప్పుడు ఉద్యోగం ఎటువంటిదీ! అన్న ప్రశ్నేయం ఏమీ లేదు. అది ఏ ప్రభుత్వశాఖలోనైనా సరే రైల్వేలోగాని, బాంకులోగాని, చివరికి కోర్టులోగాని, ఎక్కడయినాసరే అతనికి కావలసిందల్లా అయిదువేల ఉద్యోగమే. తన శాఖలో పైఅధికారులు తాను చేసినపని గుర్తించలేకపోయారు కనక ఆ ఉద్యోగం మాత్రం మరోక మంత్రివర్గంలో దొరికితే చాలు! అతనికి కావలసినది అంతా అంతే.

తలవని తలంపుగా ఈ ప్రయత్నంలో అతను పట్టిందల్లా బంగారం అయింది.

కుర్స్క్ స్టేషన్‌లో ఇలియిచ్ స్నేహితు డొకడు తటస్థపడ్డాడు. ఇతను ఇలియిచ్ కూర్చున్న ఫస్టు క్లాసులోకి వచ్చి కూర్చున్నాడు. అతని పేరు ఇలియిచ్. ఇద్దరు సంభాషణ ప్రారంభించిన తరువాత ఇలియిచ్ "ఇప్పుడిప్పుడే మంత్రివర్గంలో మార్పులను గురించి కుర్స్క్ గవర్నరు కొక టెలిగ్రాం వచ్చిం"దని చెప్పాడు. ఈ టెలిగ్రాంవల్ల ఇవానోవిచ్‌ని తీసివేసి అతని స్థానంలో సెమియానోవిచ్‌ని వేస్తారని తెలిసింది.

దీనివల్ల రష్యా అదృష్టం ఏదారిపట్టినా, ఇలియిచ్‌కి మాత్రం బాగా లాభించింది. దీనితో పీటర్ పెట్రోవిచ్, జఖార్ ఇవానోవిచ్ బాగా పెద్ద పదవుల్లోకి వెళ్లారు. వీ రిద్దరిలోను జఖార్ ఇవానోవిచ్ ఇలియిచ్‌కి చాలా దగ్గిర స్నేహితుడు, ఇంతకు పూర్వం ఇద్దరు ఒకే కోర్టులో కలిసి పనిచేశారు.

మాస్కో వెళ్ళినతరవాత పై విషయాలన్నీ నిజమేనని ఋజువయింది. పీటర్స్‌బర్గ్ వెళ్ళగానే ఇలియిచ్ జఖార్ ఇవానోవిచ్‌ని కలుసుకున్నాడు. అతడు ఇలియిచ్ పనిచేస్తున్న న్యాయశాఖలోనే అల్లాంటి ఉద్యోగం ఇస్తానని గట్టిగా హామీ ఇచ్చాడు.

ఒకవారం గడిచిన తరువాత ఇలియిచ్ భార్యకొక టెలిగ్రాం ఇచ్చాడు. దానిలో 'జఖార్‌కి పెద్ద ఉద్యోగం అయింది. ఒకవారం రోజుల్లో నాకు ఆర్డరు వస్తుంది' అని వ్రాశాడు.

ఈవిధంగా తలవని తలంపుగా మంత్రివర్గంలో మార్పులు రావడంవల్ల ఇలియిచ్‌కి తాను పనిచేసే న్యాయశాఖలోనే ఒక పెద్ద ఉద్యోగం అయింది. ఈ ఉద్యోగంలో అయిదు వేలతోబాటు, బదిలీ ఖర్చులకింద ఇంకొక మూడువేలుకూడా ముట్టాయి; ఇలియిచ్ ఇప్పుడు తనతోటి ఉద్యోగస్థు లందరికన్నా రెండంతస్థులు పైకి వెళ్ళాడు. ఇంతకు పూర్వం తన డిపార్టుమెంటువాళ్ళు, ఆ అధికారులన్నా అతనికి మంటగా ఉండేదిగాని, ఇప్పుడది అంతా మాయమైపోయింది. ఇలియిచ్ ఇప్పుడు అన్ని విధాలా హాయిగా ఉన్నాడు.

ఇదంతా జరిగిన తరవాత అతను మళ్ళీ స్వస్థానానికి చేరుకున్నాడు. ఇలియిచ్ ఇప్పుడు చిటచిటలాడేతనం పోయి, సౌఖ్యము ఇదివర కెప్పుడు చవిచూడ ఎరగను. ఈ కొత్త ఉద్యోగం వచ్చిన తరవాత ఫెడరోవ్నా ధోరణికూడా బాగా మారిపోయింది. దంపతులిద్దరిమధ్యా కొంతవరకు సయోధ్య కుదిరింది. పీటర్స్‌బర్గ్‌లో ఇప్పుడందరు ఇలియిచ్‌కి విందులు చేసేవారే. అతని శత్రువు లందరికీ స్వాంగభంగం జరిగింది. వారందరు ఇప్పుడతని చుట్టూ తిరగడం ప్రారంభించారు. కొత్త ఉద్యోగం వచ్చిన తరవాత అందరు అతన్నిప్పుడు 'ఓహో ఓహో' అని గౌరవిస్తూ, "అదృష్టం అంటే అలాగ ఉండాలి" అని అంటూ లోలోపల అతని కింత ఉద్యోగం అయిందని అసూయపడుతున్నారు. ఇలియిచ్ అంటే ఇప్పుడు పీటర్స్‌బర్గ్‌లో ఉన్న వారందరికీ బాగా ఆప్యాయత కలిగింది. ఇలియిచ్ ఈ విధంగా వచ్చిన మార్పులన్నిటిని గురించి అప్పుడప్పుడు తన స్నేహితులతో ప్రస్తావిస్తూంటేవాడు.

ఫెడరోవ్నా ఈ మాటలన్నీ వింటూ అవన్నీ నిజమేనని నమ్మినట్లు కనబడేది. ఏమీ అడ్డుమాటలు చెప్పకుండా తను ప్రయాణం సరంజాం చేస్తూ ఉండేది. ఇలియిచ్ ఇదంతా చూసి ఇన్నాళ్ళకు తన ప్రయత్నాలన్నీ దారిలో పడ్డాయనీ, భార్యకూడా ఇప్పుడు తనతో ఏకీభవిస్తున్నదనీ, కొంతకాలంనించి ఇబ్బందులు పడుతున్నా ప్రస్తుతం అవన్నీ సద్దుకుపోతున్నాయనీ, ఇప్పటి కొత్త జీవితం మర్యాదగానూ, ఖులాసాగాను సాగిపోగలదనీ సంతోషపడ్డాడు.

సెప్టెంబరు పదో తేదీనాటికి ఇవాన్ ఇలియిచ్ కొత్త ఉద్యోగంలో చేరుకోవాలి. అందుచేత ఒక పదిరోజులపాటుండిపోవచ్చునని ఉద్దేశ్యంతో స్వస్థలానికి వచ్చాడు. అదీగాక క్రొత్తచోటికి కావలసిన సామానులన్నీ ఏర్పాటుచేసుకోవాలి; కుటుంబం అంతా ప్రయాణం కావడానికి తగిన సరంజాంకూడా చెయ్యాలి.

ఇప్పుడు ఫెడరోవ్నా కూడా అతని తలలో నాలికలాగ మసులుకుంటూంది. భార్యాభర్తలిద్దరు ఒక్క మాటమీద నడిచిపోతున్నారు.

అదృష్టవశాత్తు తలపెట్టిన పనులు నిర్విఘ్నంగా సాగిపోతూండడంవల్ల భార్యాభర్తలిద్దరు చాలా అన్యోన్యంగా ఉంటున్నారు. వివాహం అయినతరువాత ఎప్పుడూ వారింత ఆప్యాయంగా మసులుకోలేదు. ఇలియిచ్ వెంటనే తన కుటుంబం అక్కడనుంచి తరలివెయ్యాలని అనుకున్నాడు గాని బావమరిదీ, అతని భార్యా, కాదు కూడదని పట్టుపట్టడంవల్ల మరి కొన్నాళ్ళపాటు అక్కడే ఉండిపోయాడు. వారి కుటుంబానికి ఇప్పుడీ కుటుంబంమీద ఎల్లలులేని మమకారం ఏర్పడ్డది. చివరికి వారి బలవంతం మూలాన కుటుంబం అంతా బావమరిదిదగ్గరే అట్టేపెట్టి, ఆ కొత్తచోటికి అతనొక్కడే బయలుదేరి వెళ్లాడు.

పట్టినదంతా బంగారం కావడంవల్ల ఇలియిచ్ స్వతః చాలా ఉత్సాహంగా ఉన్నాడు. దానిమీద భార్యానుకూల్యం మరింత భరవసా ఇచ్చింది. దానాదీనా అతను లోలోపల ఉప్పొంగిపోతూ కొత్త ఉద్యోగంలో కుదురుకున్నాడు. అక్కడ అతనికి ఒక చక్కని భవంతి దొరికింది. భార్యాభర్తలిద్దరు చాలాకాలంనించి సరిగ్గా అలాంటి భవంతిలోనే ఉండాలని ఉవ్విళ్ళూరుతూఉండేవారు. అది చాలా విశాలమైన భవంతి. పెద్దమనుషులు కూర్చునే గదులు చాలా విశాలంగాను ఎత్తుగాను ఉన్నాయి. అదీగాక అది పూర్వపద్ధతిలో కట్టిన గదులుకూడాను. ఆ భవంతిలో ఇలియిచ్ చదువుకోడానికి అన్నివిధాలా ఉపయోగమైన వేరే ప్రత్యేకమైన గది కూడా ఉన్నది. ఇదిగాక భార్యకు, కుమార్తెకు వేరే వేరే గదులు, కొడుకు చదువుకునే గది, చక్కగా అమర్చినట్లున్నాయి. కొడుకుగది ప్రత్యేకం అతని కోసం కట్టించినట్లే ఉంది. ఇలియిచ్ స్వయంగా దగ్గరఉండి, అక్కడ చెయ్యవలసిన ఏర్పాట్లన్నీ చేయించాడు. సోఫాలు మొదలైనవన్నీ ప్రాచీన పద్ధతుల్లో తయారుచేయించి తగినచోట్ల పెట్టించాడు. ప్రతీదీ సరిగా అతను తలపెట్టిన ఆదర్శపద్ధతిలోనే సాగిపోతున్నది. సగంసగం తయారైనవికూడా అను కున్నదానికంటె ఇంకా ఎక్కువ బాగా ఉన్నట్లే కనిపించాయి. 'అవన్నీ పూర్తిఅయితే పిసరంతైనా మోటుదనం లేకుండా ఎంత సొగసుగా ఉంటాయి!' అని అనుకుంటూ ఇలియిచ్ లోలోపల మురిసిపోతూండేవాడు. పడుకున్న తరవాత, ఒకసారి భవంతిలో పదుగురూ కూర్చునే గది ఎంత సొగసుగా తయారవుతుందో ఊహించుకొని ఇలియిచ్ ఉత్సాహంగా ఉప్పొంగిపోయేవాడు. తరవాత ఆ గది అలంకరించే వస్తువులన్నీ అక్కడ ఉన్నట్లు భావించుకుని మురిసి మురిసి ఆనందించేవాడు. తరవాత, తన భార్యకు కుమార్తెకు అన్నీ అచ్చంగా వారు కోరుకున్నట్లే ఉంటాయనీ, వారు కూడా పరమానందభరితులౌతారనీ అనుకుని ఎంతో సంతోషపడ్డాడు. కాని వారిద్దరూ కూడా ఆ గది అంత ప్రమోదంగా ఉంటుందని అనుకొని ఉండరు. ఇలియిచ్ పురాతన వస్తువు లమ్మేచోటికి వెళ్లి మంచి ఖరీదైన వస్తువులన్నీ చవకబారుగా కొన్నాడు. అవి అలంకరించడం వల్లనే ఆ భవంతికంతటికీ ఒక పెద్ద జమీందారీఛాయా వచ్చింది.

అయినా ఇంటికి వ్రాసిన ఉత్తరాలలో అతడా విషయం వ్రాయనేలేదు. హఠాత్తుగా అవన్నీ చూసి వారిద్దరూ ఆశ్చర్యపోవాలనీ, అందుచేత ముందుగా ఈ విషయం తెలియనివ్వకూడదనీ అతనను కున్నాడు. రాత్రింబవళ్ళవిధంగా కాలం గడిచిపోయింది. [illegible]పని అంటే అతనికి ఇష్టమున్నా, ఇప్పుడీ పని మీదది అంత ఉత్సాహంగా కనబడలేదు. ఒక్కొక్కప్పుడు కోర్టులో పని చేసేటప్పుడు కూడా తన గదిలో అమర్చే తెరలనుగురించి పరధ్యానంగా ఆలోచిస్తూ కూర్చునేవాడు. ఈ ధోరణి ఎంతవరకు వెళ్ళిందంటే—ఒక్కొక్కప్పుడు ఇలియిచ్చే స్వయంగా అక్కడ కుర్చీ ఇక్కడ, ఇక్కడ కుర్చీ అక్కడ సర్దుతూండేవాడు. ఒకసారి పనివాడొకడు గోడ పైభాగం మీద అలంకరిస్తున్నాడు. ఇలియిచ్ చెప్పిందతనికి బోధపడలేదు. అందుచేత నిచ్చెనపైకి కొన్ని మెట్లెక్కి వెళ్ళి, ఆ పనివాడికా విషయం తెలిసేటట్లు చెప్పాలనుకున్నాడు. కాని నిచ్చెన ఎక్కుతూంటే కాలు జారింది. అయితే మంచి పట్టా ఉన్న మనిషి కనక ఆ నిచ్చెన పట్టుకు వేళ్ళాడాడు. కాని అతని పార్శ్వం ఆ పక్కనున్న కిటికీ గడియకు గట్టిగా ఢీకొంది. మొట్టమొదట అది గీసుకుపోయినచోట బాగా బాధపెట్టింది. కాని కాస్సేపటికా బాధ తగ్గిపోయింది. దానిమీద అతనికి మరింత ఉత్సాహం వచ్చింది. అటుపిమ్మట ఒక ఉత్తరంలో "నాకు మళ్ళీ 15 ఏళ్ళ వయసు ఉన్నంత ఉత్సాహం వచ్చింది" అని వ్రాశాడు. ఇలియిచ్ ఆ భవంతి ఏర్పాట్లన్నీ సెప్టెంబరు నాటికి పూర్తి అయిపోతాయని అనుకున్నాడు గాని, చివరికి అవన్నీ అక్టోబరు మధ్యదాకా జరిగాయి. అయితే పనులన్నీ పూర్తి అయ్యాక అతనే గాక చూసినవారందరు అవి చాలా బాగున్నాయని మెచ్చుకున్నారు.

నిజానికి ఇలియిచ్ చేసిన ఈ ఏర్పాట్లన్నీ సామాన్యసంసారులు తమకంటె కొంచెం ఉన్న వారిని అనుకరిస్తూ చేసే ఏర్పాట్లలాగే ఉన్నాయి. వాటి అంతకంటె ఏమీ విశేషంగా లేవు. సామాన్యసంసారులైనా ఇంచుమించుగా [illegible]

అనుకరించగలరుగాని అంతకంటె మించిపోలేరు గదా! ఇలియిచ్ సంపాదించిన అకంచు విగ్రహాలు, అరగ్గులు, అపూలకుండీలు సరిగ్గా అలాగే ఉన్నాయి. ఇంత చేసినా అతని యిల్లు సామాన్యంగా అల్లాంటి తరహా మనుష్యుల ఇంటిలాగే ఉన్నదిగాని, అతనికి మాత్రం అదంతా ఒక పెద్ద బ్రహ్మాండమైన ఘనంతోలాగ కనబడింది. ఆ వేళ భార్య, పిల్లలు బయలుదేరి స్టేషనుకు వస్తున్నారని తెలియగానే ఎంతో సంతోషపడి, ఇలియిచ్ వారిని కలుసుకోవడానికి అక్కడికి వెళ్ళాడు. వారాయింటికి వచ్చేసరికి ఇల్లంతా పూలకుండీలతోను, కొత్తదీపాలతోను కలకలలాడుతూంది. నలుగురు మాట్సునేగది, చదువుకునే గది మొదలైనవన్నీ చూసి కుటుంబం అంతా బ్రహ్మానంద భరితులైనారు. ఇలియిచ్ వారికందరికి ఆ ఘనంతిలో ప్రత్యేకంగా చేసిన ప్రతి ఏర్పాటు చూపించాడు, వారవన్నీ భట్రాజుల్లా పొగడుతూంటే ఎంతో అహ్లాదంగా విని, పట్టరాని ఆనందం అనుభవించాడు. సాయంత్రం వేళ అందరు మాట్సని టీ పుచ్చుకుంటున్నప్పుడు ఫెషరోవ్నా అతనికి తగిలిన దెబ్బని గురించి అడిగింది. కాని, ఇలియిచ్ అదంత పెద్దదెబ్బ కాదని నవ్వేసి, తానెంత చురుకుగా నిచ్చెన ఎక్కి వెళ్ళిందీ ప్రత్యక్షంగా వారికి చూపించాడు. అటుతరవాత "నేను కొత్తగా గొప్ప వస్తాదును కనక, అట్టే దెబ్బతగలకుండా తప్పించుకున్నాను. కాని మరొకరయితే ఆ దెబ్బతో ప్రాణాలు పోవలసిందే. ఏదో కొంచెం గీసుకుపోవడంతో సరిపోయింది. ఇదిగో! ఇక్కడే కొంచెం దెబ్బతగిలింది. ఇక్కడ ముట్టుకుంటే కొంచెం నెప్పిగా ఉంది. అప్పుడే చాలావరకంతా తగ్గిపోయింది. ఏదో కొంచెం బొప్పికట్టింది అంతే!" అన్నాడు.

వారందరు ఆ యింట్లో సర్దుకోవడం మొదలుపెట్టేసరికి సామాన్యంగా జరిగేటట్లు, మొత్తంమీద ఇంకొక చిన్నగది ఉంటే బాగా సరిపోయి ఉండునని అనిపించింది. అయితే ఇప్పుడు అనుకున్నదానికంటె ఇంకొక అయిదువందలు ఎక్కువ వస్తున్నాయి. ఈ మొత్తం ఎంత చిన్నదయినా ఇల్లాంటి మొత్తాలు చేతిలో పడ్డప్పుడు కలిగే ఆనందం చాలా గొప్పది.

ఆరంభంలో అక్కడక్కడ చిన్న మార్పులు—అంటే అపోహ ఇక్కడికి ఈ కుర్చీ అక్కడికి జరపడంలాంటివి—ఇంకా జరుగుతూనే ఉండడం వల్ల, అన్నీ సజావుగా వెళ్ళిపోయాయి. భార్యాభర్తలిద్దరికి ఆ ధనంతో అన్ని విధాలా వచ్చింది. అదీగాక వారిద్దరు ప్రత్యేకంగా సర్దుబాటు చేసుకోవలసిన పనింకా అవసరం ఉన్నాయి.

అందుచేత ఆ యిద్దరికి కొన్ని కొన్ని విషయాలలో మాటపట్టింపులు వచ్చినా—పెద్ద గొడవలు ఏమీ రాకుండా చివరికి అన్నీ సర్దుకుపోయాయి. ఇంట్లో చేయవలసిన ఏర్పాట్లన్నీ పూర్తి అయిపోయిన తరువాత ఇంక చెయ్యవలసినది ఏమీ లేకపోవడంవల్ల మొదట్లో కొంత నిరుత్సాహంగా ఉందిగాని, కొత్తవారితో పరిచయాలు, కొత్తతోట్లకు షికారులు మొదలైనవాటివల్ల మొత్తంమీద అక్కడి జీవితం చాలా సౌఖ్యంగా గడిచిపోతున్నది.

ఇలియిచ్ పొద్దున్నే కోర్టుకు వెళ్ళి మధ్యాహ్నం భోజనానికి ఇంటికి వస్తూండేవాడు. సామాన్యంగా ఇంటిదగ్గర ఉన్నంతసేపు ఖులాసాగానే ఉండేవాడు గాని ఒక్కొక్కప్పుడు తన యింటి గొడవలవల్ల బాగా చిరాకు పడుతూండేవాడు. బల్లమీద పరిచిన తెల్లని బట్టమీద కొంచెం మరకపడినా, కిటికీ తెర గోలుసేమైనా కొంచెం వంకరపోయినా, అతని చిరచిరలకి అంతూదరీ ఉండేదికాదు. అయితే మొత్తంమీద జీవితం అంతా అతను కోరుకున్నట్లే అట్టే కవ్వింపులు లేకుండా హాయిగాను, మర్యాదగాను గడిచిపోతూ ఉండేది.

ఇలియిచ్ ప్రొద్దున్నే తొమ్మిదింటికి లేచి, కాఫీ పుచ్చుకుని పేపరు చదివి, ఆఫీసుదుస్తులు ధరించి కోర్టుకు హాజరవుతూండేవాడు. అక్కడ ఆఫీసు ధోరణిఅంతా అప్పటికే ఒకదారిని పట్టిపోతూ ఉండేది. ఇలియిచ్ కూడా దానికేమీ అడ్డుతగలకుండా అదంతా అల్లాగే నడిపించుకుపోతూ ఉండేవాడు. అర్జీదారులు, విచారణలు, కోర్టుపరిపాలన, ఆఫీసు వ్యవహారాలు, మొదలైన విషయాలన్నిటిలోను, ఏదైనా నిజాయితీ గాని, కొత్తపద్ధతి గాని ప్రవేశపెడితే చాలా గందరగోళం బయలుదేరుతుంది. అందుచేత ఇలియిచ్ జనం అందరితోను కేవలం అధికారపద్ధతిలోనే వ్యవహారిస్తూ, ఉద్యోగి పోజా నిలబెట్టుకుంటూ ఉండేవాడు. ఎవరైనా ఒక అసామి ఒక విషయం తెలుసుకోడానికి వచ్చాడనుకుందాము. ఆ విషయం ఇలియిచ్‌కి సంబంధించింది కాకపోతే, అసలతనా వ్యక్తిని దరిదాపులకి రానిచ్చేవాడు కాదు. ఒకవేళ ఉద్యోగ ధర్మంలో ఎవరైనా తన దగ్గరికి వస్తే అధికారిగా తాను చెయ్యవలసిందంతా చేస్తూండేవాడు; అల్లాంటప్పుడు ఆ వ్యక్తితో పైపై మర్యాదలు ఏమీ లోటు రానీయకుండా మాట్లాడి, వెంటవెంటనే పంపించివేస్తూండేవాడు. ఆ ఆఫీసుపని అయిపోయిందంటే ఆ వ్యక్తికి సంబంధించడంతా ఆ తంతంతో

దాది : అవును. ఈ ధనమే. నీ తాత తండ్రుల ధనము నీ వంశ పరంపరకొక్కటే. నీకై ఇచట నిక్షిప్తమై ఉన్నది. ఆనాడు యుద్ధములో నీ తండ్రిగారు విజయ రాఘవనాయనిగారు, ఇక ఓడిపోక తప్పదని నిశ్చయమైన వెంటనే, పట్టణములోని, జనానాలోని, స్త్రీలందరు, అంతఃపురములో అగ్నిలోపడి ఆహుతి అయినారు. ఆనాటి ఆ చితాగ్ని ధూమముతో నల్లబారి, పెటిలిపోయిన గోడలతో పొక్కిపోతూ ఈనాటికి నిలిచియున్న సరస్వతీ మహాలులోని గోడలను చూచితివిగదా !

వెంక హా ! దుర్భరం !

దాది ఆ సమయమున, నాలుగేండ్ల పసిపాపవు, నిన్ను కాపాడి, మరల తంజాపురాధిపతిని చేసి, నీకు సంక్రమింప చేయవలెనను సూహతో, ఈ ధనము నిచ్చట దాచియుంచినాము ఇప్పుడు బ్రతికి ఉన్న వారిలో నాకును, రాయసం వెంకన్న నియోగిగారికి తప్ప, మరెవ్వరికీ ఈ రహస్యం తెలియదు నీ కడుపు చల్లగా, ఈనాడు మా కోరికలు సఫలమైనవి

వెంక అమ్మా ! నిజంగా నీవు నాపాలిటి దేవతవు కృతజ్ఞుడను

దాది పారలతో త్రవ్వి గోతాల కెత్తించి, రత్నరాసులు తీసికో బంగారు బిందెలు రెండు వైపుల పెట్టించుకో రేపు నిండుకొలువులో పట్టాభిషిక్తుడవై, ఈ దీర్ఘ బాహువులతో, ఈ పెద్ద దోసిళ్ళతో, నీ యిష్టము వచ్చినట్లు బహూకరించు ఎంత ఖర్చుపెట్టగలవో, నీవు ఎంత పెద్ద చేతులో చూతాము

వెంక : అలాగే పూర్వం కట్టడచేసికొన్న ప్రకారం, ఏకోజిరాజుకు లక్షవరహాల నగలు, వస్త్రములు, నాలుగు ఏనుగులు, వెండి బంగారు పాత్రాదులు వేసిన గుఱ్ఱాలు ఎనిమిది, కాక, ఆయన సొంతానికి ఇనాముగా పదిహేనులక్షల నాణేలు ఇస్తాను. వారివెంబడి కార్యస్థులకు లక్షవరహాల నగలు, దివాన్ పేష్వాయికి రెండులక్షల నాణేలు, ఖానుడికి లక్ష నాణేలు; సయ్యదుసాహెబుకు లక్ష రూపాయలు; తక్కిన సరదార్లకు పదేసి వేల నాణేలు, కాక, అదనంగా వారు కోరినన్ని ఇచ్చివేస్తాను. యుద్ధములో వారు మనకు చేసిన సహాయం ఎన్నటికీ మరువరానిది. ముఖ్యంగా మన రాయసం వెంకన్న నియోగిగారికి అంతులేని ధనం ఇవ్వడమేకాక, ఆయనను అంబారీ ఉత్సవం చేయిస్తాను. ఆయన బుద్ధిబలంవల్లనే కదా, ఏకోజీ సహాయం మనకు లభించి, మనం ఇంతవారమయింది ! అమ్మా ! నీ ఆశీర్వాదబలం. ఇక నా కేవిచారము లేదు.

దాది అలాగే నిర్విచారంగా, తాతముత్తాతల పేరు నిలుపుతూ, రాజ్యమేలు. అభిషిక్తమైన మూర్తముతో, రత్నకిరీటముతో, నా కన్నులకు పండుగ చేయి పద ఇక ఆ కొట్టుతలుపు వేసివేయి. అవతలికి పోదాం (అని గదిలోనుండి వెలుపలికి పోవు చుండి )

వెంక (కొట్టు తలుపులు వేసి, దాదిని అను సరిస్తాడు )

దాది (త్రోవలో వెనుదిరిగి వెంకనుల దాసుకు చూచి) మరి, క్రొత్త ఉద్యోగాల నియామకాలన్నీ పూర్తి అయినవా ?

వెంక ఈరోజు సభలోనే అవన్నీ పూర్తి ఐనవి కాని

దాది ఆఁ కాని ?

వెంక ఒక్కనియామకం మాత్రం మిగిలి పోయింది

దాది ఏమిటిది ?

వెంక. రాయసం విషయం

దాది ఎందువల్ల ?

వెంక : రాయసం ప్రధాని నియామకం విషయంలో పలువురు పలు అభిప్రాయాలు సూచించినారు.

దాది నిర్ణయానికి రాలేదా ?

వెంక లేదు తరతరాలనుండి ఆ పదవిలో ఉంటున్నవారినే, ఈనాడుకూడ నియమించటం మంచిదని కొందరు, క్రొత్త ప్రభుత్వం కాబట్టి, సమర్థులైన క్రొత్తవారిని నియమించవచ్చునని కొందరు; వాదోపవాదాలు లేవదీసినారు

దాది తరతరాలవారు అంటే, రాయసం వెంకన్న నియోగిగారే కదా ?

వెంక . అవును

దాది : మరి నీయిష్టం ?

వెంక : నాకు కూడ అదే సముచితముగా తోచినది. వెంకన్న గారు, మన విజయ రాఘవనాయని గారికి విశ్వాసపాత్రులే కాక, రాజ్య సూత్రధారుడు తమ యశస్సు కీర్తి ధారపోసిన వారని అందరినోట అవ్యాజముగా వినవస్తున్నది. అంతే గాక, ఈనాడు ఈ యుద్ధములో, వారు మనకు చేసిన ఉపకారము అమోఘము. అందుకు మనము వారికి కృతజ్ఞులము కావలెను కదా!

దాది : తప్పక.

వెంక. కాని, సభలోని వాదోపవాదాలతో కాలాటూ పోనీక, నీతో ఆలోచించిన మీదట కార్యముఖమునకు రావచ్చునని, ఆ పర్వ నాయనా చేసినాను ఆ విషయమే, ఇప్పుడు నీతో ముఖ్యముగా ఆలోచింపవలసినది.

దాది సరి సరి ఇట్టి గడ్డు సమస్యలలో, అదు దాని ఆలోచన ? ఇక ప్రళయం అట్టే దూరంలో ఉండదు

వెంక నీవు నా తలపులో అందరి ఆడువారి వంటిదానవు కావు ఇప్పుడు నీ ఆలోచన నాకు తప్పక కావాలి

దాది అత్యంత ముఖ్యత గల ఇట్టి నియామకములు, దూరాలోచనతో చేయవలసిన పనులు

వెంక : అవును

దాది రాయసం నియోగి వెంకన్న గారిని పూర్తిగా నీ వెరుగవు ఆయన రెంపెల యోగంధరుడు

వెంక ఔను, ఆయన అసాధారణ ప్రజ్ఞ మనకు తెలుసు కదా!

దాది తెలుసు కావచ్చును, మరొకటి కావచ్చును అది ఆయన నిగ్రహానుగ్రహముల బట్టి ఉంటుంది.

వెంక ఒకప్పుడు మనపై నిగ్రహింపవలసిన అవసరం ఆయన కేముంటుంది ?

దాది పగపట్టి కాటువేయటానికి, త్రాచు పామునకు, మన మేమి అపాయం కలిగించాలి ? అది దాని స్వభావం

వెంక అంతే !

దాది : నియోగి వెంకన్న గారు అంతే.

వెంక : ఆఁ ?

దాది సందేహమా ? పూర్వము, మధుర నాయకులతోడి పగలు మున్నగువానిలో, వెంకన్న గారి ఎత్తు పైయెత్తులు అలా ఉండనీ మొన్న మొన్నటి అళగరన్న పోరులో ఆయన చేసిన కుట్ర ?

వెంక అప్పుడు వెంకన్న గారు కుట్ర చేసినారా ?

దాది అవును. పచ్చికుట్ర మొట్టమొదట మీ తండ్రి విజయరాఘవనాయనిగారు యుద్ధంలో ఓడిపోగానే, తంజావూరులో చొక్కనాథ నాయనిచే అళగరన్న, తన ప్రతినిధిగా నియమితుడైనాడు వారిరువురిలో మిత్రభేదం పుట్టించి, వెంకన్న గారు, మహాయుద్ధం తెచ్చిపెట్టినారు. ఆ తరువాత, ఏకోజి రాజుతో చేరి, ఆయనను అళగరిపై దండెత్తించినాడు తత్ఫలితముగా ఈనాడు నీకు తంజావూరు రాజ్యం లభించింది.

వెంక మనకోసమే గదా ఆయన ఇంత చేసినది ?

దాది కుట్రదారుల కుట్రలు పైకి అలాగే ఉంటవి ఇది మనమీది అనుగ్రహం కాదు ఏ నిమిషాన ఎట్టి విపత్తునైనా, వెంకన్న గారు, నిర్దాక్షిణ్యముగా తెచ్చిపెట్టగలడు తడిగుడ్డలతో గొంతులు కోయగలడు అట్టి స్వార్థపరుడు. క్షణములో ఒకరిని దింపి, ఒకరిని నిలబెట్టి, ఆయన రాజకీయములను తలక్రిందులు చేసివేయగలడు ఆయన స్వార్థమునకు అంతులేదు

వెంక అందుకు నిదర్శనం ?

దాది రాయసం నియామకములో ఆయన మాకిభాగమే ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిగా ఉండి, నిన్ను, తన హస్త నిర్దేశములపై నడిపింపవలెనని ఆయన తలంపు అది నీ వెరుగవు ఆయనతో మా తలలు బొప్పులు కట్టినవి

వెంక : అమ్మా ! ఇదంతా నిజమా ?

దాది నిజం కాక మరొకటా బాబూ ! మూర్ఖాతికి నిజం ఇప్పటికి నీకు పదునాలుగేండ్లు నిండలేదు. అమాయికుడవు ఇట్టి పన్నాగములు నీవు తెలిసికోలేవు.

వెంక అయితే, నన్నుఏమి చేయమని నీ సలహా ?

దాది : అదే ఆలోచిస్తున్నాను. (కొంచెం ఆలోచించి) నీ వన్నట్లు ఆపదలో ఆదుకొన్నవారికి మనం జన్మ జన్మకు కృతజ్ఞులమై ఉండాలికదా ?

వెంక తప్పక

దాది అట్టివారిలో, మనకు ఈ నియోగి వెంకన్నగారి కంటె ఇంకా చాలా ముఖ్యులు ఉన్నారు.

వెంక ఎవరువారు ? అమ్మా ! నేనా మహనీయులను స్మరించక, వట్టి కృతఘ్నుడ నవుతున్నానా ?

దాది నీ కెవరూ జ్ఞప్తికి రాలేదా ?

వెంక రాలేదమ్మా ! రాలేదు ఎవరో చెప్పు.

దాది తనయింటిలో మన కాశ్రయమిచ్చి, అన్నవస్త్రాదులతో పోషించినవాడు

వెంక అవునవును నాగపట్నములో ఆ కోమటిసెట్టి.

దాది దురాగ్రహులైన క్రూరరాజవర్గములవారి వలన రాగల కష్టనష్టములను కూడ లెక్కింపక, తన యింటి పసిబ్రిడ్డను నిన్ను, నన్ను, దాచి,పదేండ్లు, తాను కంట నిదురలేక, కంటి రెప్పవలె కాపాడి నాడు

వెంక అవును అతనికి మనము సర్వదా కృతజ్ఞులము.

దాది అంతేకాదు. ఎంతో ధనం వెచ్చించి, నీకు రహస్యముగా అన్ని విద్యలు నేర్పించి, ఇంతటి వైభవమునకు కారణమైనాడు. ఆ కోమటిసెట్టికి, ఏమి ఇచ్చి, ఎన్ని జన్మములలో ఋణము తీర్చుకో గలము ?

వెంక : లేదు. ముమ్మాటికి వాని ఋణం తీరదు.

దాది : బిడ్డా ! ధనరాసులు అర్పగించి, నీవా ఋణములను నీవు చెల్లించుకొనుటకు అవకాశము కల్పించినాను గదా ? నాకు కూడ ఒక వాగ్దాన మున్నది. అది నీవు చెల్లించవలె.

వెంక : అట్లే చెల్లించుదును. ఏమిటది ?

దాది : పెంచినతల్లినిగా నిన్ను అర్థిస్తున్నాను. నీవు నా వాగ్దానమును తప్పక చెల్లించాలి

వెంక : త్రికరణశుద్ధిగా చెల్లించగలను అమ్మా! ఏమిటది ? త్వరగా చెప్పు

దాది నా తనుమనః ప్రాణములతో నిన్ను కాపాడుకొనుటే నాపరమలక్ష్యము. అందులకే, నాగపట్నము చేరగానే నేనా కోమటిసెట్టిని మంచి చేసికొని, అతనితో ఒక ఒప్పందమునకు వచ్చినాను.

వెంక : ఏమని ?

దాది : ఎన్ని కష్టములకైన, ఎంత నష్టములకైన, ఓర్చి, మానవీరాజాను, పోషించినచో, ఆయన తిరిగి తంజావూరు రాజ్యమును పొందిన పిమ్మట, ఆయన రాచరికములో, నీకు దళకర్త ప్రధానికం ఇప్పించగలనని, నేనా కోమటిసెట్టికి వాగ్దానం చేసిఉన్నాను దైవకృపతో నీవు తిరిగి తంజావూర మహారాజవైనావు ఈనా కోరిక చెల్లించి, నన్ను అసత్య దోషమునుండి రక్షించుబిడ్డా !

వెంక వట్టి పిరికి కోమటిసెట్టికి దళకర్త ప్రధానికమా ?

దాది ఎందుకు కాగూడదు ? అందఱు సెట్లవలె అతడు పిరికివాడు కాదు

వెంక అంతమాత్రమున అతడు దళకర్త ప్రధానికమును నిర్వహింపగలడా ?

దాది తప్పక నిర్వహింపగలడు. అతడు మిక్కిలి సమర్థుడు అన్ని రాజ్యతంత్రములు అతనికి తెలుసును అంతియగాక, అతనికి అపారమైన ధనబలము, బుద్ధిబలము, ఉన్నవి. వనకలకై పెద్దపెద్ద వర్తకములుచేసి, దేశదేశముల పేరుకెక్కినవాడు. అవసరమైనచో నదులపై, సముద్రములపై, ఓడలతో సేనలను నడిపి, కేవులను పట్టుకోగలవాడు.

వెంక పోనీ ఆ సెట్టి అంతటి ఘటికుడే అను కొందాము. మన మీ పదవిని అతని కిచ్చిన, మన కొలువువారు సమ్మతిస్తారా ?

దాది సర్వాధికారియైన మహారాజుకు, ఇతరుల సమ్మతితో పనియేమి ?

వెంక : పోనిమ్మా. నీవన్నట్లు దళకర్త ప్రధా

నికమునకు ఆశించుకొని ఉన్న వెంకన్నగారికి, ఇది పరాభవము, కోపకారణము, కాదా?

దాది అయిన, అగుగాక. ఆయన కోపంవల్ల మనకు నష్టం?

వెంగ: ఆయన యుగంధరుడని నీకే చెప్పితిని గదా?

దాది ధనబలము, బుద్ధిబలము, అధికారబలము, ఉన్నవారియందు, ఇట్టివారు ఒక లెక్కా? ఇమా? ఆయనవల్ల నీకు వచ్చిన భయమేమీ లేదు

వెంగ ఒకవేళ వెంకన్నగారే, సభలో, ఆ పదవి నాకే కావలెనని పట్టుపట్టిన?

దాది నీవు నిర్భయముగా దళకర్త ప్రధానికము పెట్టికిచ్చి, కావలెనన్నచో వెంకన్నగారికి, ఆ పెట్టెక్రింద పేష్కారీగాని, నీవు అమలుగాని, ఇయ్యవచ్చును అంతేగాని, పదిమన్నెంతేండ్లు మనలను కాపాడిన ఆ పెట్టెని వదలి, ఈ పదవిని, ఈ ముసలితాపసికి ఈయ వీలులేదు

వెంగ అమ్మా! మున్నాటికి ఇదే నీ యిష్టమైనచో, అలాగే చేస్తాను కాని, నియోగి వెంకన్నగారు, తన కిది పరాభవముగా పరిగణించి, మన కొలువు విడిచి పోగలడేమో అని నాకు తోస్తున్నది

దాది పోతే నేమి?

వెంగ ఏమకటివలెనే, ఏకోజితో కలిసి కుట్రలుపన్ని, మనపై పగతీర్చుకోగలడని నా నమ్మకం

దాది అంత రొత్తు వచ్చినప్పుడు మాదుకో వచ్చును మన సిబ్బందిలో మాత్రము అంత చేతులు చచ్చినవా రెవరు? అన్నిటికిని పెట్టియేగలను భయపడకుము.

వెంగ సరే, నీ యిష్టం ప్రకారమే నడుస్తాను రాత్రి చాలా ప్రొద్దుపోయింది ఇక పోయి వస్తాను

దాది: చిరంజీవ!

వెంగ (వెళ్ళిపోతాడు)

---

## దృశ్యం—2

[స్థలం—కుంభకోణంలో ఏకోజీ కొలువు
సమయం—ఉదయం]

(ఏకోజీ కొలువుదీరి ఉంటాడు. పేష్వాయి ఖానూ, సయిదు సాహెబు, రాయసం వెంకన్నగారు, పరివేష్టించి ఉంటారు)

ఏకోజీ వెంకన్నగారూ! మీరు మా ఆస్థానానికి వచ్చిన ఇంతకాలంనుండి, మాకు చాలా ఉత్సాహంగా ఉంటున్నది.

వెంకన్న ఏకోజీ మహారాజుల అవ్యాజానుగ్రహమునకు కృతజ్ఞుడను

ఏకో మంచి, తంజావూరు విశేషము లేమీ చెప్పక పోతిరి?

వెంక చెప్పుట కేమున్నది మహారాజా! ఈనాడు తంజావూరు వెనుకటి తంజావూరుగా లేదు

ఏకో అనగా? సుభిక్షమేనా? మన వెంగమలదాసు

వెంక సుభిక్షమే వెంగమలదాసు దేవేంద్ర భోగములను అనుభవిస్తున్నాడు

ఏకో—సంతోషం మన చేతులలో రాజ్యములో నిలిపిన ఆ పసిపాపడు, అంతవాడు కావడం, మాకు చాలా సంతోషం

వెంక ఏకోజీ మహారాజుల అనుగ్రహం అటువంటిది తంజావూరు వారిప్పుడు బహుముఖముల రాజ్యమును పెంపొందించినారు క్రొత్త క్రొత్త కట్టడములు, క్రొత్త క్రొత్త మందిరములు, కట్టించినారు క్రొత్త క్రొత్త పేటలను కట్టించి, ఎన్నో అగారములను, ఆయుధశాలలను, నిర్మించినారు అన్నింటికన్న బృహదీశ్వరాలయమును అనేక విధముల పెంపొందించినారు. ఎందుకో, అందు అనేక రహస్య ప్రదేశములనుకూడ ఏర్పరచినారు.

ఏకో — ఎందుకేమున్నది? రాజ్యమును విస్తరింపజేయుట, కావలసిన క్రొత్తవాని నిర్మాణము, జీర్ణోద్ధారము, మున్నగునవి, రాజధర్మములే కదా!

వెంక కావేరిలోనుండి క్రొత్తక్రొత్త కాలువలు, వానిపై క్రొత్త వంతెనలు, బ్రహ్మాండముగా నిర్మించినారు కావేరి నీటితో తంజాపుర సీమనాడు బంగారము పండుతున్నది. ఎన్నో గజశాలలు, గుఱ్ఱాల చావడులు, ఏర్పరచినారు. అందుగల రహస్యాయుధాగారములకు లెక్కలేదు.

ఏకో : అట్లాగా? అయిన, ఈనాటి తంజాపుర వైభవమును ఒక్కసారి చూచిరావలసినదే!

వెంక : చూచిరావలసినదేమిటి? మహారాజుల వారు తలచినచో, అంతే నిలుచునప్పుడు

ఏకో : అదేమిటి వెంకన్నగారూ? అది మన రాజ్యము కాదుగదా?

వెంక : మన రాజ్యము కాక, వారి సొత్తునా? కష్టపడి మహారాజులు సంపాదించి యిచ్చినదే కదా?

ఏకో : తోడిరాజులు, మీ కోరికవల్ల సహాయం చేసినాము అంతే. అయినా, ఇప్పుడు తంజావూరులో వచ్చిన విపరీత మేమిటి? సెంగమలదాసు మనకు మిత్రుడే గదా?

వెంక : అవును మహారాజా అన్నట్లు, సెంగమలదాసు మనకు మిత్రుడే! కలిసిన మిత్రునియింట మిత్రులు కొంతకాలం నిలువగూడదా?

ఏకో : ఓహో! అదా మీ అభిప్రాయము? అయిన సంతోషమే.

వెంక : తంజావూరు ప్రభుత్వవిధానము కూడ కొంత మారినది. అసలు, వారి అభిప్రాయములే మారినట్లున్నవి.

ఏకో : ఎందువలన?

వెంక : రాజ్యములో అన్ని శాఖలను పెంచుటయే గాక, వారు ముఖ్యముగా కోటలను బందోబస్తు చేసి, సైనికశాఖపై దృష్టి కేంద్రీకరిస్తున్నారు. ఇప్పటికిప్పుడే, సేనాబలము అపారముగా సమకూర్చినారు. క్రొత్తక్రొత్త దళవాయులను నియామకం చేసి, అచ్చటచ్చట నిలిపినారు. చూడగా, వారి ఉద్దేశములో, ఏదో దండయాత్రయో, మరేదో, ఉన్నట్లున్నవి.

ఏకో : వారెవరు? ఈ యేర్పాటులలో మీరు లేరా?

వెంక : లేను.

ఏకో : కారణం?

వెంక : ఈనాడు సెంగమలదాసుకు నేను పనికిరాను.

ఏకో : మరి, మీ రాయసపు పదవి?

వెంక : నాకు లేదు. నేనిప్పుడు తంజావూరు పౌరుడనుకూడా కాను.

ఏకో : మరి, యిప్పుడు తంజావూరు దళకర్త ప్రధానికం?

వెంక : ఒక కోమటిసెట్టి.

ఏకో : అతడెవరు?

వెంక : నాగపట్నపువాడు. చిన్నతనమున సెంగమలదాసును, దాదిని, తన యింటనుంచుకొని అతడు పోషించినవాడు. అందువలన అతని కీనాడు ఆ పదవి లభించినది.

ఏకో : ఓహో! కోమటిసెట్టి దళకర్త ప్రధాని! అహ్హహ్హా! (విరుగబడి నవ్వుతాడు)

(సభలోని వారందరు పెద్దగా నవ్వుతారు)

శేషువాయి : (నవ్వుతూ) వెంకన్నగారూ! మీ రాజుకు ఏమైనా మతిపోయిందా?

వెంక : మతే కాదు.

ఖాను : ఈ అధికారం, మీకు గాకపోతే, మరొక బ్రాహ్మణుడికి గాని, వెలమ దొరలకు గాని, మరొక సమర్థునికి ఈయవచ్చును గదా? ఈ కోమటి సెట్టి యేమిటి?

వెంక : బాలరాజు చిత్తం అలా పనిచేసింది.

సయిదు : ఇది రాజుచిత్తం కాదు. తెరచాటు భాగవతిపువారి చిత్తం అయివుంటుంది.

ఏకో : సరిసరి. ఆ నియామకం జరుగునప్పుడు మీరు కొలువులో లేరా?

వెంక : ఉన్నాను. మొట్టమొదట దళకర్త ప్రధానిగా నన్నే నియోగింపదలచి, నాకై తెప్పించిన అలంకారములతో సెట్టిని అలంకరించి, అతని చేతికి అధికారి ఉంగరం వేయించి, సెంగమలదాసు ఆ కోమటి సెట్టిని ఏనుగు హౌదాలో కూర్చుండబెట్టి పట్నం ప్రవేశం చేయించినాడు.

ఖాను : పరాభవం! వట్టి కృతఘ్నుడు.

శేషు : తంజాపుర రాజ్యానికి మీరు మీ సర్వశక్తులు ధారపోసినారు!

సయిదు : ఏకోజీ మహారాజుల సహాయమును కూడా, సెంగమలదాసు, ఈనాడు తలపోసినట్లు లేదు.

వెంక : పట్నం ఊరేగివచ్చి, ఏనుగు దిగి, ప్రభువు పాదాలపై బంగారుపూలు చల్లి, నిలబడగానే, సెంగమలదా సాతనిని కౌగిలించుకొని, దగ్గ

రగా కోటలో ఇట్లు ప్రకటించినాడు:— నేటి నుండి ఈ కోమటిసెట్టి మన దళకర్త ప్రధాని. ఈ రోజు మొదలు మీరందఱు ఈ సెట్టి ఆజ్ఞ ప్రకారం నడుచుకోవాలి—

ఏకో: అందుకు కొలువు వారందఱూ సమ్మతించారా?

వెంక: ప్రభు చిత్తమునకు అత్యంతకరమా మహారాజా? అలా చెప్పి, వెంగమలదాసు, మరల ఇలా శాసించినాడు— కొరత చిహ్నముగా మీరందఱు, మన దళకర్త ప్రధాని సెట్టిగారితో, వారి నిడిచిదాకా పోయి, సెలవు గొనిరావాలి— రాజాజ్ఞ ప్రకారం అందఱు అట్లే కావించినారు.

పేమ: మీరు?

వెంక: నామాత్రం అది దుర్భరం అయింది. ఇక ఈనాటితో తంజావూరుకు, నాకు ఋణం తీరింది. ఇంత పరాభవంతో ఇక్కడ ఉండలేకన్న, ఎప్పటికైనా పోయి, భగవద్ధ్యానంతో ఈ వృద్ధాప్యంలో కాలం గడుపుకోవచ్చునని, వెంటనే ఇల్లువదలి, దేశాంతరములకు బయలుదేరినాను.

భాను: అప్పటికీ వెంగమలదాసు, మీ విషయం ఆలోచించనే లేదు?

వెంక: అతనికి అంత తీరిక, అవకాశము, ఎక్కడివి? కొలువులో అట్టి విపరీతోక్తులు ప్రవేశించినవి. ప్రభువు స్వయంగా అసహాయుడు, బాలుడు.

ఏకో: ఆ తరువాత?

వెంక: దేశాంతరములకుపోతూ, త్రోవలో, మహారాజావారి దర్శనం చేసికొని, కొలదిదినములు ఇచ్చట నిలువవచ్చును గదా అని, ఇచ్చటికి వచ్చినాను.

ఏకో: ఇంత వృద్ధాప్యంలో మీ కట్టి అగౌరవం మాకు సహించరానిదిగానే ఉన్నది. మీరిచ్చటికి రాక, మాకు అపరిమితానందం కలిగించింది. ఇక మీరెక్కడికీ వెళ్ళ నక్కరలేదు. హాయిగా మాదివాణములో, శాశ్వతముగా నిలిచి పోవచ్చును.

వెంక: మహారాజుల అనుగ్రహమునకు కృతజ్ఞుడను.

(సభికులందఱు సహృదయభావంతో తమ ఆనందం, సమ్మతి వెలిబుచ్చుతారు)

ఏకో: (ఇంచుక ఆలోచనతో) వెంకన్నగారూ! ఇంతకు, ఈ విషయంలో, తంజావూరు దొరల అభిప్రాయం?

వెంక: ఏముంటుంది? ఇక తంజావూరు రాజ్యపతనానికి ఆట్టే దూరంలేదు. అందువల్లనే, వారు ఆ కోమటిసెట్టిని ఆ పదవిలో నియోగించుకొన్నారు.

ఏకో: అందుకు ప్రబలమైన కారణం?

వెంక: వెంగమలదాసును పెంచినవాడికి, ఆ కోమటిసెట్టి వల్లభుడు.

ఏకో: ఓహో! అర్థమయింది. చాల న్యాయ కర్తవ్యము! స్త్రీబుద్ధి!

వెంక: చిత్తం మహారాజా! మీదే పునః ప్రతిష్ఠితమైన తంజావూరు సింహాసనము, నేడో, రేపో, మనకళ్ళముందే, పరాయి దొరలవశం కానున్నది. అదే నాకు పట్టిన హృదయవేదన.

ఏకో: పాపం! వట్టి అదృష్టహీనులు!

వెంక: అవి ఇదని విడిచి, ఈ సమయంలో మనం ఊరుకోనరాదు మహారాజా!

ఏకో: ఊరుకొనక?

వెంక: ప్రభువులే ఆ సమస్యను దక్కబరచవలె.

ఏకో: ఎట్లు?

వెంక: తాము సంపాదించిన తంజావూరు సింహాసనము తామే నిరభ్యంతరంగా లోబరచుకొనవచ్చును.

ఏకో: వెంకన్నగారూ! చేసిన విస్తరి తీసివేసి, పాపం కట్టుకోమంటారా?

వెంక: పతనోన్ముఖమైన రాజ్యమును ఉద్ధరించుట పాపమా మహారాజా!

పేమ: (ఏకోజితో) ఒకప్పుడు మనమే కదా, వెంగమలదాసుకు సహాయం చేసినది?

భాను: మరల మన శౌర్యముతోనే, ఆ గద్దెను కాపాడాలి.

[illegible]

వెంక : ఈ విషయంలో, మా దాదిఅమ్మ అభిప్రాయం ఎలా ఉంటుందో?

సెట్టి అఁ! ఆమె అభిప్రాయం తప్పక తెలిసి కోవలసినదే.

(దాది ప్రవేశం)

సెట్టి. అదిగో, మాటలోనే ఆమె కూడా వచ్చింది. సంఘటన అంటే, అలా ఉండాలి.

దాది : ఏమిటి విషయం?

వెంక అమ్మా! ఈనాడు, రాయసం వెంకన్న నియోగి గారు, మా కొలువుకు ఒక వర్తమానం పంపేరు.

దాది : వెంకన్నగారా? ఇప్పుడు వారెక్కడ ఉన్నారు?

వెంక : అయ్యంపేటలో.

దాది : ఏం చేస్తున్నారు!

వెంక : వృద్ధాప్యంలో విశ్రాంతిగా కాలం గడుపుకొంటున్నారట

దాది వారి వర్తమానం అయ్యంపేటనుంచే పంపేరా?

వెంక అవును

దాది : ఏమని?

వెంక సెట్టిగారూ! ఏది? ఆ కమ్మ చదివి వినిపించండి

సెట్టి (కమ్మ విప్పి ఇలా చదువుతాడు)

"శ్రీ శ్రీ వెంగళరాజు మహారాజులుం గారి పాదసన్నిధికి, తమ ఆశ్రితుడు రాయసం వెంకన్న, అనేక దణ్ణములు పెట్టి, పంపుకొన్న విన్నపములు

ఏ కారణంచేతనో, గోల్కొండ రాజులకంటె, ఏలిక మహారాజా, మీరే మిక్కిలి కోపంతో ఉన్నారు ఎంత ఆలోచించినా, కోపకారణం తెలియవచ్చుట లేదు. తంజావూరుమీద దండు వెడలుటకు కూడా, ఏలికరాజా, ఆలోచన చేస్తున్నట్టు, నాకు తెలియవస్తున్నది. తమ ఆశ్రితుడను, మేలును కోరినవాడను, గనుక, నేనీ వర్తమానమును పంపుచూ, రహస్యముగా, ప్రభువులకు తెలియజేసుకొంటున్నాను.

ఇట్లు
తమ ఉప్పుకారములో పెరిగిన
రాయసం వెంకన్న.
అయ్యంపేట.

దాది : ఏది? మరొక్కమాటు చదవండి!

సెట్టి (మరల తాపీగా చదివి వినిపించును)

దాది మోసం. పచ్చిమోసం.

సెట్టి మోసమా?

దాది అవును. తంజావూరును మాచి, కమ్మ గుట్టి, ఆ చిత్తులమారి పన్నిన పన్నాగమే ఇది.

సెట్టి : అంత అవసరం?

దాది : రాయసం దళకర్త ప్రధానిగా తన్ను నియామకం చేయలేదని, తంజావూరునుండి లేచి పోయి, ఏలికతో కలిసి, మరల పుట్టలు పొగించి నాడు ఈ దుష్టుడు వట్టి కుట్టిపురుగు

సెట్టి రాజు కొలువులో ఉద్యోగం శాశ్వతంగా తనకే ఉంటుందనీ, తనకే ఉండాలనీ, ఏ బుద్ధిమంతుడూ అనకోడు

దాది అది బుద్ధిమంతుని విషయం

సెట్టి : ఆ మాయల మరాటీవాళ్లనుకూడా, ఆయన, తన వలలో వేసికొన్నాడంటూనా!

దాది మరాటీల కేమిటి! ఆయన, యముడినైనా తన వలలో వేసికోగలడు.

సెట్టి దొంగమరాటీ దండువాళ్ళను, ఈ వదులు ఒకరుచెప్ప నక్కరలేదు.

దాది : ఏమైనా కానీయండి. ఇది ఆ నియోగి వెంకన్నగారి కుట్రగాని, మరొకటిగాదు. కుట్రలోనే ఆయన, మన చిట్టికాయను సింహాసనమెక్కించినాడు; ఈనాడు మరల కుట్రలోనే, మరొకవిధం చేయ సంకల్పించినాడు. ఆయన చేతులలో తంజావూరు సింహాసనం, బంతివలె, చాలా చేతులు మారింది.

సెట్టి పోనీ, వెంకన్నగారి కుట్రయే అనుగాక మరాటీవాళ్లు మనమీద కోపగించే ఉంటారు కదా!

దాది : నిస్సందేహంగా. అంత కోపం ఆయనే తప్పక కలిగించి ఉంటాడు.

సెట్టి: ఏమేమిటి? మొక్కుబడి కాబోలు. ఈ రాజ్యమునందు. ఈ రాయలవారందు. (బిగ్గరగా) ఎవరక్కడ?

వెంక: సెట్టిగారూ!

సెట్టి. సెట్టి లేదు. పొట్టి లేదు. నీవు పట్టి పడి పోవడమే వెంగమాంబగారూ! ఏమిటి ఎలాగయ్యా, ఉండు. మా తిప్పలు మేము పడతాము.

వెంక అది గాదు సెట్టిగారూ!

సెట్టి నీకేమీ తెలియదు. అలా ఉండమంటే! మరాటీవాళ్ళ చేతుల్లో పడి చావబోతామా? (మరల బిగ్గరగా) ఎవరక్కడ?

భటు: (వెనుక ప్రవేశించి) చిత్తం ఏమి సెలవు?

సెట్టి రొక్కం, బంగారు నగలు, రత్నాలు, సంచుల కెత్తుకొని, గుర్రాలతో వేయిమంది జనాన్ని, మూడు పల్లకీలను, తెరలు కట్టి, సౌధం వాకిట సిద్ధంగా ఉంచు. పో త్వరగా పో.

భటు (చిత్తం. వెళ్ళిపోతాడు)

దాది సెట్టిగారూ! మన కెటు పోవాలి?

సెట్టి (ఆలోచించి) ఆఁ! ఆఁ! తిరుచినాపల్లి వైపుగా.

దాది అమ్మయ్యో! అది మనకు శత్రుస్థానం కదా?

సెట్టి ఫరవాలేదు. తిరుచినాపల్లెను ఆనియున్న పాళెయపట్టులో, ఆ ఊరి దొర, రంగప్ప నాయక రాయుడు, నాకు మిత్రుడు. ఆయన ఆశ్రయంలో మనం ఉండవచ్చును

దాది: అది మనకు క్షేమమే నంటారా?

సెట్టి. ఫరవాలేదు. ఎవరికీ వ్యాపారంలో అతనికి నాకూ చాలా లావాదేవీలు ఉన్నవి. మన కేమీ కొఱఁత జరగదు.

భటు (ప్రవేశించి) సర్వము సిద్ధమైనది.

సెట్టి: సరే. నీవు త్వరగా పోయి,—కోట కాపరి, రాజప్రాసాదంలో అన్ని వాకిళ్ళు, తెరిచి ఉంచమని, నగరంలో ఎవరూ కత్తి పట్టవద్దని, ఏలిక లోనికి ఘనంగా స్వాగతం ఇమ్మనీ,—రాజ్యాన్ని గా మహోత్సవంగా అప్పగించమని చెప్పు.

భటు: చిత్తం (అని, చరచర వెళ్ళిపోతాడు.)

దూరాన గుర్రాలు కొట్టిన చప్పుళ్లూ, సేనా కలకలం వినవస్తుంది)

సెట్టి: (విని వణకుతూ వణకుతూ) అదిగో, గుర్రాల చప్పుళ్లు మరాటీవాళ్లు వచ్చి పడతారే పద! తాళం వేయండి! త్వరగా వేయండి!

(వెంగమాంబను, దాదిని, చేయి పట్టుకొని, త్వరగా పల్లకీలలోనుండి లేవదీస్తాడు)

(ముగ్గురు ఒక్కొకరుగా రాజసౌధం విడిచి, పల్లకీలలో ఎక్కి వెళ్ళిపోతారు)

(వేయిమంది అశ్వికులు వారిని అనుసరిస్తారు.)

## దృశ్యం—4

[స్థలం—తంజావూరు రాజదర్బారు మహలు. సమయం—ఉదయం]

(మంగళవాద్యాలు, నగారా లొడ్డుబాకా వగైరా, మ్రోగుతూ ఉంటవి. ఏకోజీరావు తాను మంత్రి సచివాదులతో కొలువుకు వస్తాడు. రాయసం వెంకన్న, భాను, పేరుబాయి, దయాదుబాయి, ఆయన ప్రక్కనే క్షత్రియులతో మస్తాబయి, వస్తారు. రాజోద్యోగులు అందరు బరాబరులు చేస్తూ ఉంటారు)

(పార్శ్వన దీపాలు, నగలు, వస్త్రాలు, చంద్రికోజ్జ్వలాలు, ప్రకాశిస్తూ ఉంటవి కుడిఎడమగా కోటవాకిట తోరణాలు మ్రోగుతూ ఉంటవి)

(వందిమాగధులు ఇలా పలుకుతారు)

వందిమాగధులు ఓ! ఓ! శివాకోర ఓ! శివాజీ మహారాజ సహోదరా! మహారాష్ట్రైక్యదయ పయఃపారావార రాకాసుధాకరా! విస్తుల బాహుబల విభృతరాతిమండలా! నిజభుజబలావలోక ఖండలా! చాంద్ర కిరణోరస తరంగ తరంగిత నిజహృదయాంతరంగా! శ్రీతజనాశ్రితంగా! శిష్ట కర్ణాట రాజ్యభూజ ప్రతిష్ఠాపన మహోద్దీపనా! తంజాపురరాజ్య లక్ష్మీ వ్యథ స్వయంగ్రహమహోత్సాహ విలాసవిలసిత విభూతి విజయా! రాజాధిరాజశ్రీ ఏకోజీమహారాజుం ప్రార్థ్యధామా! జయ! విజయీభవ! విజయీభవ!

ఏకోజీ. (సింహాసనము సమీపించి, ఒక్క మారు అందరిని కలయజూచి, ఆసీనుడౌతాడు.)

మంత్రి సామంతాదులు అందరూ (నిలు

చుండి ఉండి) రాజాధిరాజ రాజశ్రీ ఏకోజీమహారాజ ముల పార్శ్వభాగా ! జయ ! విజయీభవ ! విజయీ భవ !

(అని పలికి, రాజు కరసంజ్ఞతో తమ తమ ఆసన ములలో ఆసీనులౌతారు)

పురోహితులు. (ఒక్క స్వరముతో) స్వారాజ్యం వైరాజ్యం మహారాజ్యమాధిపత్యం, పృథివీసముద్రపర్యంతాయా వసంతాయా ఏకరాడితి శతమానంభవతి శతాయుః పురుషః శతేంద్రియ ఆయుష్యేవేంద్రియే ప్రతితిష్ఠతి.

(అని ఆశీర్వాదములు పలుకుతారు)

(నృత్తగీత వినోదాదికములన్నీ పూర్తిఅవుతవి)

ఏకోజీ ఈనాడు పర్వదినం. మీ అందరి ఉత్సాహబలముమీద, నేడీ తంజాపుర రాజ్యమును చేపట్టి, సర్వ ప్రజారంజకముగా పరిపాలన సాగించ దలచుకొన్నాము. ఈనాటితో తంజావూరురాజ్యము లోని చిక్కులన్నీ తీరిపోయినవి

కొలువువారు అందరు—జయ ! విజయీభవ!

ఏకోజీ ఈ మహైశ్వర్యమునకు కారణభూతు లైన మీ అందరిని నేను అభినందిస్తున్నాను ఘన స్వాగతముతో, నన్ను సింహాసనమునకు ఆహ్వానిం చిన తంజాపురరాజకార్యముల వారిని, మిక్కిలి అభినందిస్తున్నాను

మంత్రులు : మహారాజుల మహానుగ్రహం

ఏకోజీ అనాయాసముగా మా కీర్తి విజయ మును సమకూర్చిన శ్రీరాయసం వెంకన్న నియోగి గారికి, ముఖ్యముగా మా సంతోషమును తెలుపు కొంటున్నాము

వెంక : ధర్మ సంస్థాపనమునకు కంకణము కట్టు కొని అవతరించిన అపరశివావతారము శ్రీ శివాజీ మహారాజుల సహోదరులు శ్రీ ఏకోజీ మహారాజులు మారాజులు కావటం మా అదృష్టం

ఏకో : వెంకన్నగారివంటి మహామేధావులు, ప్రజ్ఞాధురంధరులు, మాకు సహాయం కావటము, మా అదృష్టమని కదా.

వెంక శ్రీ శ్రీ ఏకోజీ మహారాజుల నిండు కొలువులో, ఈనాడు, ఈ ఇందిరామందిరము, సాక్షాత్తు ఇందిరామందిరముగా ప్రకాశించుచున్నది.

ఏకో నేటినుండి తంజాపురరాజ్యము, మా మహారాష్ట్ర పరిపాలనము క్రిందికి వచ్చినది అయి నప్పటికి, ఇది నేను అపహరించినదని కాదు, కావలెనని కోరుకొన్నది కాదు, కాదు కాబట్టి, రాజ కార్యములలో, మునుపు ఉన్నవారి నే, అదే పద వులలో, అట్లే ఉండ నియోగించుచున్నాము.

కొలువువారందరు—మహారాజుల మహానుగ్ర హమునకు కృతజ్ఞులము.

ఏకో తమ తమ ఆచారములలో, మాన మర్యా దలలో, నేనెన్నడు ఎట్టి అభ్యంతరము కలిగింప బోను, తంజావూరు ప్రజలకు, నేను, ప్రతిజ్ఞా పూర్వకముగా అభయమిచ్చుచున్నాను ఎవరి అగ్ర హారములకును, ఆస్తిపాస్తులకును, దేవాదాయముల కును అడ్డురాను.

కొలువు వారందరు — మహారాజులకు జయ మగుగాక !

ఏకో : పూర్వపురాజుల వలెనేనులలో నేను నేనుకూడ తెలుగుభాషను, తెలుగుకవులను పోషించి, వారిచే క్రొత్తప్రబంధములను నిర్మింపించగలను. పూర్వ ప్రబంధములను, ఆదరించి, ప్రకటనలోనికి తీసికొనిరాగలను. మా రాజ్యముకూడా అని, మా మహా రాష్ట్రభాషను తంజాపుర ప్రజలపై రుద్దను

కొలువు వారందరు ధర్మప్రభువులకు జయ మగుగాక!

ఏకో తెలిసి ఉండవచ్చు, సుస్వాగత పూర్వ కముగా, మాకు అఖండ విజయమును సమకూర్చిన తంజావూరు కోటవాకిలికి, మా సంతోష చిహ్న ముగా, "ఫతే దర్వాజా" అని సార్థకముగా నామ కరణము చేయుచున్నాము ఈనాటినుండి అది అట్లు వ్యవహరింపబడును గాక!

తెరలో (వాద్యధ్వానాలు)

ఏకో తమ రాజు చెంగమలదాసు బాలుడైన కారణమున, ఆయనను లెక్కచేయక, కొందరు, కరడులు, మానివేసి, తల యెగకట్టిన చుట్టుపట్ల సీమల లోని చెప్పుకీల వండలేని, జయ భయములులేవన వకరదుకొని, పాలెగాండ్లను క్రొత్త కప్పములోనికి గొనివచ్చి, సీమ అంతా స్వాధీనపు తీసికొనివచ్చుటకు

సమర్థులైన వారిని నియమించి, ఆ పనులు రెండు మూడు రోజులలో పూర్తిచేయవలసినదిగా మంత్రులను ఆజ్ఞాపిస్తున్నాము.

మంత్రులు మహారాజుల ఆజ్ఞ

ఏకో ముఖ్యముగా మీ అందరు సమక్షమున నేను మిమ్ము దొకటి చేయవలసియున్నది.

సభికులు అందరు (అది యేమా అని ఆతుర తతో ఏకోజీ ముఖంకేసి చూస్తూ ఉంటారు)

ఏకో మా ఈ రైతుజన కంటకుడైన ముఖ్య కారకులు ఎవరో మీకు తెలిసియే ఉంటుంది

శేషు అతడు రాయసం వెంకన్న నియోగి గారు.

ఏకో ఆయన మాకు చేసిన సహాయం, మరువ రానిది ఆయనకు నేమెంతో ఋణపడియున్నాము.

భాను నిజంగా

వెంక మహారాజుల అనుగ్రహం

ఏకో ఏమి బహూకరించి, వారి ఋణం తీర్చుకోగలమో, మాకు తోచుటలేదు

వెంక మహారాజుల అనుగ్రహం చాలును

(సభ అంతా తుంటెపు నిశ్శబ్దంగా ఉంటుంది)

శేషు చెంగమలదాసు రాచరికంలోని పర కర్త ప్రధాని కోమటిసెట్టి, వరాలి అయినవాడుగదా?

భాను. అవును. వెంకన్న గారిని ఆ హోదాలో ఉంచటం, మాకు చాలా ఖుషీమకుగా ఉంటుంది

ఏకో అందుకు వెంకన్న గారు అంగీకరిస్తారా?

వెంక మహారాజుల ఆజ్ఞాపాలనమే నా విధి.

ఏకో (కొంచెం ఆగి) అందుకు వెంకన్న గారు సమ్మతించినా, ఈ పాటి స్వల్పఉద్యోగం వారికి ఇవ్వటానికి, నా మనస్సు ఒప్పటం లేదు. (కొంచెం ఆలోచించి) వెంకన్న గారు, ఆ సమాన ప్రజ్ఞా ధురీణులు. వారి ఆలోచనలు, యుక్తులు, అర్థం చేసికోగలవారు ఎవ్వరూ లేరు. ఎంతటి అసాధ్యమైన పనినైనా, అయుదయోగంసర ప్రజ్ఞతో, ఇతరులు కొశ్యకుండా, సాధించగలరు.

భాను: నిజం నిజం.

ఏకో: ఈ వెంకన్న గారు, ముందు చెంగమల దాసును వెంట తీసికొని పాదుషాదగ్గరకువచ్చి, మా కుమ్మక్కు మీద ఎదిరించి జయించి, అతనికి పట్టంకట్టించినాడు. తిరిగి యిప్పుడు తనకు, చెంగమలదాసుకు, సరిపడక పోవుటచేత, తంజావూరుయుంది లేచివచ్చి, మమ్ములను పనికొలిపి, దండు నడిపించి, యుక్తితో, చెంగమలదాసు పట్నం విడిచి పారిపోయేటట్లు చేసినాడు. పాపం! ఆ అమాయకపు బాలరాజా, ఆ పిరికి కోమటిసెట్టికి, ఆ ముసలివాడికి, కర్మై, మూఠా లోచనలేక, ఇంత దుర్గతిపాలైనాడు!

సభికులు (నివ్వెరతో, వినోదంతో, కాదు మారవుతూ ఉంటారు.)

వెంక (అదరుగుండెతో కళకళ పోతూ ఉంటాడు)

ఏకో ఈ వెంకన్న గారు సామాన్యులు కాడు బహు యుక్తిపరుడు ఇతడు నిలబడిన చోట, ఉన్న గడ్డిమాడిపోయి, ఇక మళ్ళీ మొలకెత్తదు నందు దొరికిందో, ఇక ఆయన మనలను కొంటెపద్యాలమనకొ అడిస్తాడు అతను చెప్పినట్లు మనం నడుచుకోవాలి లేదా, తంజావూరువారిగతే, మనకు పట్టుతుంది కనుక, ఆయన విషయంలో, అతి జాగ్రతగా ఉండవలెను గాని, ఏమరచి ఉండ రాదు

శేషు—నిజం నిజం వెంటనే, ఆయనకు తగిన చర్య తీసికోవాలి

ఏకో ఒక్కక్షణమైనా, ఆయనను స్వతంత్రునిగా ఉండనీరాదు ఎంతైనా, ఏమైనా, చేయగలడు.

వెంక (భయసంభ్రమాలతో) మహారాజా! మహారాజా!

ఏకో, వెంకన్న గారూ! ఇంకా మీ నక్కవినయాలు, ఈ ఏకోజీముందు సాగవు.. (భానును, శేషునుచూచి) వెంకన్న గారిని వెంటనే పట్టి, యావజ్జీవ కారాగారంలో..

సభికులు అందరు—(భయాశ్చర్యాలతో కుదిసి పడి, విప్పిన కళ్ళతో, ఏకోజీకేసి చూస్తూ ఉంటారు.)

సేవ, భామ! (తమ కుర్చీలలోనుండి లేచి వెంకన్న గారిపై బడి పొడుస్తారు)

వెంక (ఆదటలో) మహారాజా! మహారాజా!

ఏలో అదే! ఏమిటంటావు భామా! అలా కాదు ఆయనను పట్టి, బికారిని చేసి, మన తంజావూరునుండి వాటించి, తిరుచినాపల్లె పాలికులను తిరిగి వేయండి తిరుచినాపల్లెవారికి, తంజావూరువారికి, తీరని పగలు తెచ్చిపెట్టి, వెంకన్న గారు, ఆ రెండు రాజ్యాలవారిని కంటిమీద నిద్రపోనీయకుండా చేసినాడు ఆయన అతి తెలివికి, అత్యాశకు, కుట్రలకు, మాయలకు, తగిన ప్రతిఫలమును, తిరుచినాపల్లెవారే కలిగించుతారు

వెంక: (ఆవేదనతో పడిపోతూ) మహారాజా! మహారాజా!

ఏలో ఇంక నీ ముఖం నాకు కనబడరాదు. నీ మాట నాకు వినబడరాదు. సేవకాయా! భామా! అదే! పట్టి బంధించండి.

భామ, సేవ (వెంకన్న గారిని పట్టి బంధించి, తీసికొనిపోతారు.)

ఏలో (సింహాసనమునుండి లేస్తాడు)

కొలువు వారందరు (శ్రీ ఏలోజీ మహారాజుల వారికి జయము గాక! మహారాష్ట్ర సామ్రాజ్యము వర్ధిల్లును గాక!

ఏలో (కొలువు విడిచి, సౌధంలోకి వెళ్ళిపోతాడు)

కొలువు వారందరు (తమ తమ స్థానాలకు వెళ్ళిపోతారు)

(తెర)

---

# కొండవాగు 

శ్రీ పూరంపూడి భాస్కరరావు

కొండవాగు కొన్నాళ్లై పడానా
గుండెలోన గలగల మందీ!
నిండి వెండి చుక్కల గమితో నీ
రెండలోన తళ తళ మందీ!
  మొగ్గ కడుపులో తేనెలూరుతే
  ప్రొద్దుపోని మన బ్రతుకులలో
  ఇరువదేండ్ల నూనూగు జవ్వనము
  పరువ మొనగు తీయని కాలం!
సన్న సన్నపాటల మధు ధారలు
కాలువారు ఆ గడియలలో

కొండవాగు కవిగీతికలా నా
గుండెలోన గలగల మందీ!
నిండి వెండి చుక్కల గమితో నీ
రెండలోన తళ తళ మందీ!
  కాని నేటి వేసగి యెడారిలో—
  నిలువలేక, పెనుకడలి నీరముల
  కలియలేక, అర్థాయుష్కుని వలె—
కొండవాగు జీవన విహీనమై
మెతడి ఇసుకపొర దాగినదీ!

సంప్రదాయములు భాషానుబోధములు. ఏజాతి భాష జూచినను ఆ భాషలో సంప్రదాయములు లక్షణములు కొన్ని యేర్పడి కట్టినట్లగపడును. కవి మొదట చూచుకొనవలసినది భాషాపాటవము. భాషాపాటవ మనగా శబ్దప్రయోగము తెలిసికొనుటయే కాదు. ఏ శబ్దముచేత జాతిలక్షణము వ్యక్తమగునో ఆ శబ్దమును బట్టుకొని యాయా భావముల కచ్చుగట్టినట్లు పరిపుష్టపరచెను. ప్రసిద్ధకవులను జదువుట యనగా వారు వాడిన శబ్దముల కర్థము తెలిసికొనుట మాత్రమే కాదు. శబ్దార్థము తెలిసినను నా శబ్దము సుచితమైన చోటు వాడలేము. ఏ భావమును జెప్పుట కే శబ్దమే విధ శక్తిమంతముగ వాడబడినది యని యూహించి చూచినగాని యా మెలకువలు తెలియవు. శబ్దమున కర్థము తెలిసికొనుటకంటె శక్తిని తెలిసికొనుటకు సహృదయుడు ప్రయత్నించుచు. కవిత్వమంతయు నా శక్తిమీదనే యున్నది. శబ్దమును ప్రాచీనులలో కొన్నిలు చెట్టుకొని పాడుగవలెను. పింగళి సూరన

"పానగ ముత్తెపుసరుల్ పోహళించినవోలె
తనులోన దొరయు శబ్దములు గూర్చి"

అని యుల్లేఖించినాడు. ఎంత జాగ్రత్తగా శబ్దములను చేర్చి కూర్పవలెనో యిందు సూచితమైనది. ఇందులోనే యొక చమత్కారమున్నది. ముత్యముల హారములు గ్రుచ్చునపుడు వల్లని బట్టపై ముత్యములు పోసి కూర్చుదురు. హారము రాను రాను క్రమక్రమముగ పైవాడిక భాగమును గప్పు భాగము పైపునకు స్థూలముగా జేయును. ముత్యమునకు ముత్యమునకు గలిగిన యా సూక్ష్మభేదమును గ్రహించి కూర్చవలెను. ఏ ముత్యము తరువాత నే ముత్యమావలకు భేదముతో కుదురుకొనుచున్న సునిశిత సూక్ష్మ పరిశీలనాదృష్టియే కొందరికో యుండును. ఇట్లు గ్రుచ్చుటకే పోహళించుట యని పేరు. పోహళింపు శబ్దము నీ సందర్భమునందే వాడవలెను. రత్నములు మొదలైన పెద్దపెద్దపూసలహారము గ్రుచ్చునపుడు పోహళించుశబ్దమును వాడిన కవి శబ్దౌచిత్యము తెలియదన్నమాట. కృష్ణశాస్త్రి వాడిన యే శబ్దము శక్తిమంతమైనది కాదు. కొన్నికొన్ని శబ్దములు భావముతో కలియక *Vague* గా నుండును.

"ఇపుడు వచ్చితివా నీ కొర
కెదురు చూచు నీవిరహాగ్ని
రొప్పెద కుంచుకుడులు కురియును
మాపేమా, రేపటికో
పనిలి చనునో, నిదురమునుగునో!"

పదములు భావములో గలియక పొడిపొడిగా దేలిపోవుచున్నవి.

భాషాపరంపరలో మారుపద్ధతులు ముఖ్యముగా కనిపించుచున్నవి. ఆచారములు—సంప్రదాయములు మొదలైనవానిని దీసికొనివచ్చి భాష నుద్ధరింపజేయుట. ఈ మార్గము మహాకవు లందరిలో నున్నది.

"అయమా గృహీతకమనీయ కంకణస్తవ మూర్తి
మానిత మహోత్సవః కరః"

అన్నాడు భవభూతి. చిత్రపటదర్శనములో సీతావివాహము జ్ఞప్తికి వచ్చి యిట్లు చెప్పినాడు. గాజాలతో నింపిన కరమును పట్టుకొనుట వివాహోత్సవంతయు వ్యక్తముచేయుచున్నది. అంతో యింతో యీ మార్గము తెలియనిదే మన ప్రాచ్యకవిత్వమే లేదు. మహాకవులలో నిది యెక్కువగా కనిపించును. ఇక రెండవది రసమార్గము. ఆ చేయి స్పర్శ తగిలినది—పులకలు వచ్చినవని యని చెప్పుట భవభూతి.

"తవస్పర్శేస్పర్శే మమహి పరిమూఢేంద్రియగణో
వికారశ్చైతన్యం భ్రమయతి సమున్మీలయతి చ"

అన్నాడు సీత స్పర్శతగిలిన కొలదిగా రాముని పరిమూఢములైన యింద్రియగణములు వికారము పొందుచున్నవట. ఇక కాళిదాసులో నీ మార్గములు లెక్కలేనన్ని యున్నవి. ఇక మూడవది. ఆమె స్పర్శ తగిలినది—ఆ కాలములో నున్నానని చెప్పుట. ఇది *Lyric* మార్గము. హేతువునకు ఫలితమునకు మధ్య నున్న వికార మిందు తెలియదు. ఏ సుఖమో—ఏ యలంకారమో—క్రమ్ముకొని యీ రచన సాగును. కృష్ణశాస్త్రి కవిత్వములో వాక్యప్రాయమైన భాగమీ మూడవ మార్గము. పై రెండు మార్గములు చాల స్వల్పముగ నున్నవి.

'మఘవ హస్తక మకుట మాణిక్యరాజి' యని యూర్వశిని సంబోధించుటలో కొంచెముగా మొదటి మార్గము గోచరించుచున్నది. ఆ మార్గములు కనిపించినంతవరకు నీ కవిత్వము రమణీయముగనే యున్నది కాని ఆ మార్గములేని భాగమే యెక్కువ. ఆ మూడవ మార్గము ప్రసిద్ధప్రస్థాన వ్యతిరేకమయినది. కాని నీ కవి యవలంబించినాడు. ఈ భావ యనువాదమునకు సులభముగనే కాని భావము యొక్క లేవను ప్రకటించదు.

ఈయన భావ మొక పరిమితిని చుట్టిపెట్టుకొని తిరుగుచుండును. అది దాటి కొంచెమైనను జరుగదు. హృదయమునుండి వచ్చు బాధ తులగి భావమును బోసికొని బయటకు వచ్చినట్లనిపించదు. కొన్ని మధురములైన శబ్దములు, భావమును బలవంతముగా లాగుచున్నట్లు కనిపించును. దీనికి నే నే యుదాహరణ లివ్వనక్కరలేదు. ఈయన కవిత్వములో దేనినైన నుదాహరింపవచ్చును. ఏ భావమైనను—ఒక్కటే బాధ—ఒక్కటే నిర్వహణ. ఆమె ప్రియప్రేమ కవిత—

# శుభగ్రహం



శ్రీ సింగరాజు లింగమూర్తి

సీతాపతి ఇంట్లో అడుగు పెట్టిన వ్యవధానం లేదు వంటింటిలోంచి రుసరుసలతో, విసవిసలతో భార్య ప్రత్యక్షమైంది. ఒకసారి ఆమె భర్త ముఖం లోకి చూసి, మూతిముడుచుకొని తిరిగి వంటింటిలోకి వెళ్లింది. క్షణం అలాగే నిలబడిపోయాడు సీతాపతి. తరువాత నెమ్మదిగా గదిలోకి వెళ్లి కోటువిప్పి ఒంకికి తగిలించాడు. వంటింటిలోంచి భార్య కంచాలు, గిన్నెలు ఎత్తివేయడం, ఏదో విసుక్కోవడం వినవచ్చింది. కుర్చీ మంచంమీద కూలబడ్డాడు, వంటింటికి గదికి మధ్యనున్న గోడవంక చూస్తూ.

'సుందరికి కోపం ఎందుకు వచ్చిందో? తాను పల్లెత్తుమాట కూడా అనలేదే. ప్రొద్దుట తాను ఆఫీసుకు వెళ్లేముందు కూడా నవ్వుతూనే మెసిలింది. ఇంతలో ఏం ప్రళయం ముంచుకుపోయిందని ఈ ధుమధుమలు? ఒకవేళ పిల్లలు ఏమైనా విసిగించారేమో!' అనుకున్నాడు సీతాపతి. కాని ఆ సమాధానం అతనికి అంతగా తృప్తికరంగా లేదు. కారణం ఏమైవుంటుందా అని పరిపరివిధాల ఆలోచించసాగాడు. కారణం బోధపడకపోగా పైగా అదొక వేదనగా మారింది అతనికి!

'ఎంత సంపాదించి ఏం? గోచిపాతకు చాలకపోతే. పిల్లల ముద్దూముచ్చట్లు తీర్చడానికి నోచుకోలేదు నా బ్రతుకు' అంటూ వంటింటిలోంచి వినవస్తున్న సుందరమ్మ సణుగుడు అతని హృదయాన్ని గాయపరిచింది.

'నిజమే. ఎంత సంపాదించినా గోచిపాతకే చాలదు' అనుకున్నాడు సీతాపతి అప్రయత్నంగా. అతని దృష్టి ఒంకికి తగిలించిన కోటుమీద పడింది. కోటు మోచేతులదగ్గర చిరిగిన మాసికలు, చేతుల చివరి నుంచి వ్రేలాడుతున్న దారప్పోగులూ, కోసి పోతున్న సందెంత్రాణాలూ సుందరమ్మ అన్న మాటలను వక్కాణిస్తున్నాయి. రంగు మాసిపోయి నలిగిపోతూ శిథిలావస్థలోవున్న ఈ కోటు తన గౌరవాన్ని కొంత కాపాడుతున్న దనుకున్నాడు సీతాపతి. చిరిగిన చొక్కాలపైన ఆ కోటును ఎంతో ఘనంగా వేసుకుంటున్నాడు. క్రమంగా సీతాపతిదృష్టి కోటుమీదినుంచి క్రిందపడివున్న చెప్పుల మీదకు పోయింది. గదిలోకి వచ్చి చెప్పులు విడవడంలో ఒకటి బోర్లగిలపడింది. ఒక తెగినవారు తొంగిచూస్తున్నది. అక్కడక్కడా మిగిలివున్న అట్టముక్కలను పట్టి, సీల అతుక్కుపోయి వున్నాయి. 'ఇన్నాళ్లనుంచీ నీ కాళ్లక్రింద నలిగిపోయాం. మాలో శక్తి నశించింది ఇకనైనా మాకు ముక్తిలేదా' అంటున్నట్టుగా వుంది ఉంగరాలు తెగిన రెండవ చెప్పు.

'రూపాయి పావలాకు కాని మరమ్మత్తు చేయవచ్చు. ఆ డబ్బు ఎక్కడినుంచి తేనూ?' అనుకుంటూ సీతాపతి మంచంమీద నడుం వాల్చబోయాడు. నవారు ఫటుక్కున తెగింది. ఇంట్లోని ప్రతివస్తువూ, ప్రతివ్యక్తీ తన అసమర్థతను దుయ్యబట్టుకుంటున్నట్టుగా బాధపడ్డాడు సీతాపతి. 'నిజంగా ఇది తాతలకాలంనాటి నవారు. ఇంకెన్నాళ్లని బలంగా వుంటుంది' అనుకున్నాడు. వంటింటిలో సుందరి చేస్తున్న ఆర్భాటం కొంత తగ్గింది. 'అవును, తగ్గకేం చేస్తుంది కల్పించుకొనేవాళ్లు లేకపోతే' అనుకున్నాడతను. ఈ సత్యం, సుందరమ్మ కాపురానికి వచ్చిన మరుసటి సంవత్సరంలోనే గ్రహించాడు సీతాపతి. లేకపోతే సీతాపతి కల్పించుకుంటే ఈ పాటికి ఎంత రభసజరిగేదో!

'ఇవ్వాళ కాఫీప్రాప్తి లేదేమో' అనుకుంటూ

సీతాపతి మంచంమీదనుంచి లేచాడు. ఇంతలో, 'లక్ష్మీ టీకా కట్టాలి నాన్నా లేకపోతే పేరు కొట్టేస్తారు' అంటూ ప్రసాదు గదిలోకి వచ్చాడు. ఏడు వారాలో తొందర సీతాపతి కొంచెంసేపు బుర్ర తీసుకున్నాడు తండ్రి వినిపించుకోలేదేమోనని ప్రసాదు మళ్ళీ ఒకసారి జ్ఞాపకం చేశాడు 'సరే మాన్దాం లేవోయ్' విసుగ్గా అన్నాడు సీతాపతి. ప్రసాదు గదిలోంచి వెళ్ళిపోయాడు ఇంట్లో నిలకడం సీతాపతికి ఎంతో కష్టమైపోయింది సుందరి కాఫీ త్వరగా తెచ్చిస్తుందేమో తాగి బైటపడదామనుకున్నాడు ఇంతలో చటుక్కున జ్ఞాపకం వచ్చింది రాత్రి తానే చెప్పాడు, ఖర్చులు ఎక్కువ అవుతున్నాయనే ఉద్దేశంతో 'సాయంత్రంపూట కాఫీలు మానేద్దా'మని ఇహ వేచివుండడం అనవసరమని సీతాపతి ఆ శిథిలావస్థలో వున్న చెప్పులనే తొడుక్కొని ఇంట్లోంచి బైటపడ్డాడు

బజారులవెంట నడుస్తున్నాడే కాని సీతాపతి మనస్సంతా భిన్నత్వంగానే వుంది ఎడతెరిపి లేకుండా ఏవేవో ఆలోచనలు వస్తున్నాయి, పోతున్నాయి. 'ఎన్నాళ్ళని ఈ బాధామయజీవితం గడపడం?' అని ఎన్నోసార్లు ప్రశ్నించుకున్నాడు దానికి ఓ స్థాయి అంటూ ఏమీ చిక్కకపోవడంవల్ల ఆలోచనలు ఏ ఏ విషయాలమీద దొర్లినా తిరిగి అదే ప్రశ్న ఎదురౌతున్నది 'నమస్కారమండీ' అన్న గొంతు విని పక్కకు తిరిగిచూశాడు ఆ వ్యక్తి అప్పటికే సీతాపతిని దాటిపోయాడు తన పరాకుకు ఆశ్చర్యపోయాడు సీతాపతి ఎదురుగుండా వున్న దుకాణం గోడమీద 'అధికోత్పత్తి చేయండి' అనే వాల్ పోస్టర్ మీద అతని దృష్టి పడింది ఒకసారి నవ్వుకున్నాడు 'వేల ఖర్చులో వాల్ పోస్టర్లు అచ్చువేయించి పట్టణాలలో గోడలకు అంటించినంత మాత్రాన అధికోత్పత్తి ఇట్టే అయిపోతూవుంటుంది కాబోలు' అనుకున్నాడు కాలువరోడ్డ మీదుగా గాలి వచ్చింది 'ఎటు పోదాం' అని ఆలోచించాడు 'అలా గార్డెనుకు వెడితే రేడియో అయినా వినవచ్చుగా' అనుకుంటూ గార్డెను వైపు నడకసాగించాడు దారిలో ప్రభుత్వ కచ్చేరీ ఒకటి కనిపించింది ఆ ఆవరణలో వరుసాగ్గా మూర దూరంగా నాటబడిన మొక్కలమీద సీతాపతి దృష్టి పడింది. ఆ మొక్కలకు ఏ జంతువులవల్లా హాని కలుగకుండా మాత్రం దడులు కట్టివున్నాయి. మొక్కలు ఎండిపోయి ఆకారమాత్రంగా నిలిచి వున్నాయి. 'ఇదేగా మొన్న జరిగిన వనమహోత్సవ సందర్భంలో నాటిన మొక్కలు ఈ ఉత్సవం పేరుతో వేల కొలది డబ్బు ఖర్చు పెట్టారు ఇలా ఎన్ని మొక్కలు ఎండిపోతున్నాయో పోషణలేక దీని కెవరు బాధ్యులు? ఇలాంటి పరిస్థితిలో ఉద్యమం ఆశయాలు ఏవిధంగా ఫలిస్తాయో!' అనుకుంటూ నడుస్తున్నాడు సీతాపతి ఈలోగా గార్డెనులో ప్రవేశించి ఒకమూల పచ్చికబైలుమీద కూర్చున్నాడు రేడియోలో అధికోత్పత్తిని గూర్చి ప్రసంగం సాగుతున్నది 'అధికోత్పత్తి అని మొత్తుకుంటారే కానీ, అవుతున్న ఉత్పత్తిని సక్రమంగా వినియోగం అయ్యేట్టు చూసేదేం ఎవ్వరూ!' అని ప్రశ్నించుకున్నాడు సీతాపతి.

క్రమంగా గార్డెనులో దీపాలు వెలిగాయి మరికొంతసేపు రేడియో వింటూ అలాగే కూర్చున్నాడు సీతాపతి ఆకలి వేస్తున్నట్టు అనిపించింది 'మానవులకు ఆకలిదప్పులు లేకుండా చేయలేకపోయాడేం మనిషిని సృష్టించగలిగిన బ్రహ్మ' అనుకుంటూ సీతాపతి లేచి నెమ్మదిగా ఇంటిముఖం పట్టాడు

రాత్రి భోజనాలముందరకూడా సీతాపతి మౌనంగానే కూర్చున్నాడు. సుందరమ్మమాత్రం ఏదో సణుగుతూనే వుంది భర్తమీద కూటిపోటి మాటలు విసురుతూనే వుంది. సీతాపతికి పొలమారింది మంచినీళ్లు తాగి, "అబ్బ ఇంటిలో ఇంత కారం తగిలేశావేం . కొత్త నెయ్యి వెయ్యి' అన్నాడు

'నెయ్యి వెయ్యటానికి అక్కడ వుందేమిటి ! మీరు తెచ్చిన అర్ధసేరు నెయ్యి అప్పుడే అయి పోయింది అదనునుచి కొత్తదొంచే మీరూ అన్నాయికే రాల్చారు.' అంది సుందరమ్మ.

'నిజమే ఎన్నాళ్లు వస్తుంది అర్ధసేరు నెయ్యి అక్కడికీ సుందరి నిక్కచ్చి మనిషి కాబట్టి పది రోజులు వాడింది' అనుకుంటూ సీతాపతి మారు మాటాడకుండా భోజనం చేస్తున్నాడు.

'సాయంత్రం సీత్ర వెళ్ళాక డాక్టరుగారు మనిషిని పంపారుకాన్నా. బిల్లుకోసం' అన్నాడు. పక్కనే కూర్చుని భోజనం చేస్తున్న ప్రసాదు.

'ఊఁ' అన్నాడు సీతాపతి మంచినీళ్లగ్లాసు క్రిందపెడుతూ.

'సాయంత్రం పనిదానికి మళ్ళీ ఒళ్ళు వచ్చి పడింది. సీత్ర డాక్టరు దగ్గరికి తీసుకు వెళ్ళింది.'

'చీటికీమాటికీ డాక్టరుదగ్గరికి వెడితే ఇహా చెప్పక్కరలా సంసారంసంగతి ఇప్పటికే అయనకు బోతెడంత బిల్లుచెల్లించాలి'

'అయినా ఇవ్వాళ్ళింది ఇవ్వకుండా మళ్ళీ ముందుకెడితే ఏంబాగుంటుందమ్మా!' అన్నాడు ప్రసాదు.

'కంట్రీకోడులు పినవారికిపంతో అక్కడ కూడపెట్టిందేం కనబడదు' పాఠింపుగా అంది సుందరమ్మ ఇహా తాను మాసంతహీస్తేనే తప్పలేక పోతే వాసన పెరుగుతుందనే ఉద్దేశంతో సీతాపతి త్వరత్వరగా భోజనంముగించి గదిలోకి వెళ్లాడు

మంచంమీదనుంచి పక్కబట్టలంతీసి, తెగిన నవారును ముడిపెట్టడానికి పట్టీలు బిగించడాగాకు కొంతసేపు శ్రమపడి ఆ తెగినచోట ముడిపెట్టి పక్క పరుచుకొని నడుంవాల్చాడు ఇంతలో సుందరమ్మ మరచెంబుతోవచ్చి చెంబు మంచంక్రిందపెట్టి సీతాపతి కాళ్లవైపు కూర్చుంది సీతాపతి ఆమె ముఖంలోకి ఒకసారిచూశాడు కోపం చాలామటుకు చల్లారినట్టే గ్రహించాడు

'ఏమండీ పంపెక్కి అమ్మాయిని అల్లుణ్ణి తీసుకురావటన్నారుటగా' అంటూ సుందరమ్మ మాటిగా ప్రశ్నించింది అప్పటికి అర్థమైంది సీతాపతికి భార్యచేసిన అర్భాటానికి కారణం.

'మాట్లాడరేమండీ రాత్రి మన పక్కింటి విశ్వనాథంగారితో అన్నారుటగా' అని సుందరమ్మ తిరిగి ప్రశ్నించింది

'ఏం మంచుకుపోయినట్టు ఆ యన భార్య అప్పుడేవచ్చి చెప్పింది కాబోలు!'

'బాగా తెలుస్తుంది చదువు. మీరుఅనడం కాగానే వుందికాని ఆమెవచ్చి చెప్పడం కష్టమైందా మీకు? పైగా అయిన్నూకూడా తీసుకు రావద్దన్నారుటగా!'

'లేనిపోయింది పైగా ఇదొకటా. అయనే అన్నాడు, ఈ ఏడు తీసుకురావని'

'వాళ్ళ గొడవ మనకెందుకుగాని మీ సంగతి చెప్పండి. అమ్మాయి కాపురానికి వెళ్ళింది ఈ ఏడేగా తొలిపండుగయ్యె తీసుకురాకపోతే ఏం బాగుంటుందండీ? ఆడపిల్లయ్యె ఊరూరు మనదూ? విశ్వనాథంగారంటే ఏటేటా కూతుర్ని, అల్లుణ్ణి తెస్తున్నారుకాబట్టి ఈ సంవత్సరం మానుకున్నా పరవాలేదు వారితోపాటు మీరూ లేనంటే ఎట్లా? ఇరుగుపొరుగువారంతా అడుగుతున్నారు. ఇంకా అమ్మాయిని తీసుకురాలేదేమని పట్టుమని పదిరోజులులేదు పండుగ' అంటూ సుందరమ్మ ఎడతెరిపిలేకుండా మాట్లాడింది

'నీవు చెప్పింది నిజమేనే. కాని కాస్త ఆలోచించు—వాళ్ళను తీసుకు రావాలంటే మాటలా? ఇద్దరికి బట్టాపాతా పెట్టాలామరి కోరెడంత ఖర్చు ఎక్కడి నుంచిరేనూ?'

'మన ఇబ్బందులు ఎప్పుడూ వుండేవే.. ఒకనాటితో పోయేవిగనుకనా?' ఏదో విధంగా చేయాలిమరి తప్పుతుందా?'

'తప్పకుంటాలంటే ఎట్లా, చేతకానప్పుడు తప్పించుకోవాలి—దాని పెళ్లికి చేసిన అప్పులో వాలుగవభాగమైనా తీర నేలేదు అదీగాక ఇంకా బోలెడన్ని అప్పులు ఏర్పాయి. రేపు పోకట్టక పోతే అబ్బాయిపేరు కొట్టేస్తారట. పైగా బిల్లు కోసం డాక్టరు మనిషిని పంపాడయ్యె. ఎట్లా చెప్పు?'

'మీరు అన్నిటికీ అన్ని చెబుతారు .. ఎప్పుడూ దాం దన్నగొడవే మీకేం.. నలుగురూ నవ్వి అంటారు పెండ్లయిన ఏడుకదా, పండుగకు అల్లుణ్ణి కూతుర్ని తీసుకు వెళ్లలేదని వియ్యాలవారు మనల్ని లేకిడిచేస్తారు'

'ఒకరు అంటారని, లేకిడి చేస్తారని మనం భయపడితే ఇహా సంసారం జరిగినట్టే. .రేపు మనం

కష్టంలోవుంటే పిలంకా మనల్ని ఆదుకుంటారా ?'

'అలా మొండిగా సమాధానం చెబితే ఎలా గండీ ? మీమనుమడు బాబుర్దాకోదూ మన గురిలోనా ?'

ఇక ఎంత నచ్చచెప్పినా లాభంలేదని సీతాపతికి తెలుసు అనవసరంగా వాదన పెరగడం, ఆమె కంట తడిపెట్టడం మొదటినుంచి అనుభవంలో తెలుసుకున్నాడు సీతాపతి 'సరే మాద్దాంలే' అన్నాడు, అప్పటికి ఆమెను సమాధానపరచడానికి. సుందరమ్మ ఆమాటలతో కొంత తృప్తిపడింది ఇక కేమీ మాట్లాడకుండా లేచివెళ్లింది తన పక్కమీదికి

సీతాపతికి మాత్రం ఆరాత్రి సరిగా నిద్దర పట్టలేదు సమాజంలో తిరుగుతున్న తనబోటి మధ్య తరగతి జనం అభిమానం చంపుకోలేక ఎంతమంది బాధపడుతున్నారోనని సీతాపతి విచారించాడు ఆర్థికవ్యవస్థ మారితేనేగాని సమాజం బాగుపడదనీ, సమాజం బాగుపడిందాకా మధ్య తరగతి జనం ఇలా బాధపడాల్సిందేననీ అనుకున్నాడు

సీతాపతి మరునాడు ఆఫీసులో పనిచేస్తుండగా పోస్టుమన్ వచ్చి కవరు అందించి పోయాడు చేస్తున్న పనిని ఆపి సీతాపతి కవరు ఎక్కడినుంచి వచ్చిందా అని ఎగాదిగా చూసి, కూతురు వ్రాసిందని తెలుసుకొని కవరు చించి ఉత్తరం చదివి తెల్లమొహం వేశాడు.

తోటిగుమాస్తా సీతాపతి ముఖ కవళికలు పట్టి, 'ఎక్కడినుంచి ఉత్తరం అంతా క్షేమమేనా ?' అని ప్రశ్నించాడు 'ఆ' అన్నాడు సీతాపతి ముక్తసరిగా 'మరెందుకూ అలా వున్నారూ ?' తోటిగుమాస్తా తిరిగి ప్రశ్నించాడు

'అబ్బే ఏమీ లేదండీ మా అమ్మాయి పండక్కి వస్తానని వ్రాసింది '

'అయితే ఇంకేం సంతోషమే గదండీ !' అన్నాడు తోటిగుమాస్తా తన విచారం ఏమిటో అతనికేం తెలుసు అనుకున్నాడు సీతాపతి

రాత్రి కూతుర్ని తీసుకురావడం విషయంలో మాటవరుసకి 'సరే చూద్దాంలే' అని భార్యతో అన్నా అసలు తీసుకురావద్దనే అనుకున్నాడు సీతాపతి కాని ఇప్పుడు తప్పించుకో వీల్లేదు. కూతురు వ్రాయడం కూడా చమత్కారంగానే వ్రాసింది 'పండక్కి నాన్నగారువచ్చి మమ్మల్ని తీసుకు పోతారనుకుంటున్నాము' అని చివరనున్నట్లో పడ్డాడు సీతాపతి 'తీసుకురాకపోతే భార్య అన్నట్టు వియ్యాలవారు నిజంగానే తనను ఆడిపోసుకుంటారు. తెస్తే వందరూపాయలకు తక్కువ ఖర్చు కాదు' ఎంత ఆలోచించినా ఏమీ పాలుపోదు సీతాపతికి అల్లుడి హోదాకు తగినట్టు బట్టలు పెట్టాలి పెళ్లిలో కూతురికి ఒకచీర తక్కువ పెట్టామని, ఉగాదికి మంచి పట్టుచీర కొనిపెడతానని మాటివ్వటం కూడా స్ఫురణకు వచ్చింది ఎంత ఆలోచించినా అల్లుణ్ణీ కూతురినీ తీసుకురాక తప్పేట్టు కనపడలేదు ఆయనకు 'ఒకవేళ తీసుకురాదలచుకుంటే ఇరవై రూపాయలు ఖర్చుపెట్టుకొని తాను వెళ్లడం దనికి రమ్మని వ్రాస్తే చాలదూ' అనుకున్నాడు సీతాపతి ఇంతకూ తనకు అప్పిచ్చే దాతయేడీ ? మొన్న తోటిగుమాస్తా రంగనాథం, డబ్బు అత్యవసరమై, ఒకరిదగ్గర రూపాయికి రెండణాల వడ్డీచొప్పున తీసుకున్నానని చెప్పాడు తనుకూడా తీసుకుంటే అమ్మో ఇంకేమైనా వుందా కొంపకుల్లామే ఎలాగా' అని తర్కించుకోసాగాడు సీతాపతి పరాగ్గా కూర్చోవడంవల్ల సీతాపతి చెయ్యి సిరా బుడ్డికి తగిలి, సిరా ఫైలుమీద పడింది 'అరరే' అనుకుంటూ బంట్రోతును పిలిచి అది తుడిపించి పనిలోపడ్డాడు

* * * *

తెల్లవారితే ఉగాది అనగా సుశీలా ఆమె భర్త శ్యామలరావూ దిగారు. సీతాపతి ప్రసాదును వెంటబెట్టుకొని వాళ్ళను ఇంటికి తీసుకు రావడానికి స్టేషనుకు వెళ్లారు. సీతాపతి ఎంతో సంతోషంగానే అల్లుణ్ణి కౌగలించుకున్నాడు కాని ఆయన మొహంలో ఏమూలనుంచో తొంగిచూస్తున్న విషాద రేఖను శ్యామలరావు కనిపెట్టకపోలేదు కారణం మాత్రం ఊహించలేకపోయాడు. కూతురూ అల్లుడూ వచ్చినందుకు సుందరమ్మ మురిసిపోయింది. సుశీల చిన్నతమ్ముణ్ణి ఎత్తుకొని ముద్దులాడింది. తల్లితో తన

అత్తవారింటి సంగతులు చెబుతూ ఎంతో ఉత్సాహంతో తల్లి చేసే పనుల్లో ఆమె కూడా పాలు పంచుకుంది. 'మొదట మీ అల్లుడుగారు రావన్నారమ్మా ఎంతో బలవంతం చేస్తే వచ్చారు' అంటూ సుశీల భర్త విషయం చెబుతూ అంది. ఆ రాత్రి సుశీల తల్లిదగ్గర కొంచెంసేపు పడుకొని తాను అత్తవారింటికి వెళ్ళాక నేర్చుకున్న క్రొత్తపాటలను పాడి వినిపించింది.

సీతాపతి పైకి ఎంతో సంతోషంగా వున్నట్టున్నా, లోపలపడుతున్న ఆవేదనను కప్పిపుచ్చడానికి ఎంత ప్రయత్నించినా శ్యామలరావు అందరితో మాట్లాడుతూనే మామగారి విచారాన్ని కనిపెడుతూనే వున్నాడు

* * * *

తెల్లవారింది తలంట్లు, పేదు తినడము అన్నీ ఒకదాని వెంబడి ఒకటి క్రమంగానే జరుగుతున్నాయి. మామగారూ, అత్తగారూ, బావమరదులు తనకు జరుపుతున్న మర్యాదలకు సిగ్గుపడ్డాడు శ్యామలరావు. 'అల్లుడంటే వీరికింత మోజెందుకో? తమ కుటుంబంలో అల్లుడుకూడా ఒకడని భావించకుండా, ఒక అధికారికి చేసినట్టు మర్యాదలు చేయడం, పోచి పెట్టడం దేనికో?' అనుకున్నాడు శ్యామలరావు. 'తను కూతుర్ని సుఖంగా ఏలటానికనా, ఈ మర్యాదలూ, కానుకలూ' అనికూడా అనుకున్నాడు. తరం తరానుగతంగా వస్తున్న ఈ ఆచారానికి ఎన్ని కుటుంబాలు బుణాల పాలవుతున్నాయో అని శ్యామలరావు తలచాడు. రాత్రి గదిలో మామగారు తనకూ సుశీలకూ తెచ్చిన బట్టలను చూపించింది సుశీల 'పాపం ఆయన వీటికోసం ఏ వంద రూపాయలో ఖర్చు పెట్టివుంటాడు. మిగతా పిల్లలకు కూడా ఏమీ బట్టలు తేనట్టువుం' అని సులభంగానే గ్రహించాడు శ్యామలరావు మొదట శ్యామలరావు పండక్కి అత్తవారింటికి రానన్నది కూడా ఇదే కారణం చివరకు సుశీల కన్నీళ్లు పెట్టుకొని తను కూడా వెళ్ళనని బ్రతిమాలితే తప్పనిసరిగా బయలుదేరి వచ్చాడు.

తలంటిపోసుకున్నాక, శ్యామలరావు 'ఊళ్లోకి వెళ్ళివస్తా' నని సుశీలతో చెప్పి వెళ్లాడు. సీతాపతి అర్జంటు పనులున్నాయని ఆఫీసుకు వెళ్లాడు. పిల్లలు కేరింతలు కొడుతూ ఆడుకుంటున్నారు. సుందరమ్మ మడికట్టుకొని వంటచేస్తూ, 'అమ్మాయ్ కొత్త పచ్చి కూర తరిగి పెట్టమ్మా' అంటూ సుశీలను కేక వేసింది

'ఏమో అమ్మా రాత్రికి సినిమాకు వెడదామని అంటాకలని' అంది కూర తరుగుతున్న సుశీల

'ఏమో తల్లీ మీ నాన్నగారు ఏమంటారో. అంతా వెళ్ళాలంటే మాటలా? బోలెడంత అవుతుంది'

'అంతగా అయితే మీ అల్లుడిగారిచేత ఖర్చు పెట్టిస్తాలేవే అమ్మా'

'బాగానే వుంది అతగాడిచేత ఖర్చుపెట్టిస్తే ఏం బాగుంటుంది? మీ నాన్నగారిచేతిలో డబ్బు లేదు ఇప్పటికే బోలెడంత అప్పయింది తల్లీ అంతగా అయితే, మొన్న మీ పెద్దమామయ్య వచ్చినప్పుడు పది రూపాయలు ఇచ్చిపోయాడు నాకు అవి మీ నాన్నకు తెలియకుండా దాచాను. అవి పెట్టుకు వెడదామూలే'

ఇంతలో శ్యామలరావు రావడంవల్ల వాళ్ల సంభాషణ ఆగిపోయింది శ్యామలరావు గదిలోకి వెళ్లిపోయాడు సుశీలకూడా అతని వెనకనే గదిలోకి వెళ్ళింది

'ఏమిటి సుశీ మీ అమ్మ దాచుకున్న పది రూపాయలతో సినిమాకు వెడదామనే?'

'అబ్బే లేదండీ మా అమ్మ అంటున్నది కానీ ఇంతలో వినేశారటండీ? ఇదేమిటి పోట్లం? అబ్బో ఇవన్నీ ఏమిటండీ. ఎందుకు తెచ్చారూ?'

'ఎందుకేమిటండీ నీ తమ్ముళ్ళూ చెల్లాయిలకు మాత్రం పండుగ కాదూ? వాళ్ళుమటుకు క్రొత్త బట్టలు కట్టుకోవద్దూ?'

'బాగానే వుంది. ఎంత తగలేశా రేమిటి? వాళ్ళకు మనం పెట్టడం ఏమిటండీ!'

'ఏం వాళ్లు పెట్టినవి మనం కట్టుకొని మురవచ్చుగానీ మనం వాళ్ళకి పెట్టకూడదేం?' అన్నాడు శ్యామలరావు కటువుగా. సుశీల ఇంకేమీ మాట్లాడలేకపోయింది పొట్లం తీసుకొని 'ఇదుగో

"నన్నూ.. మీ అల్లుడుగారు బట్టలు తెచ్చారు" అంటూ వంటింట్లోకి వెళ్ళింది.

* * * *

భోజనాలు అయినాయి. అంతా క్రొత్తబట్టలు కట్టుకున్నారు సీతాపతి సుందరమ్మలు తప్ప సీతాపతి తన గదిలో పక్కమంచంలో కూర్చొని ఆయన భార్యను గూర్చి, మొన్నటివరకూ కూతురినీ, అల్లుణ్ణీ లేవని చెప్పిన విశ్వనాథం తనకంటే మంచి వాళ్ళను పిలిపించడాన్ని గూర్చి ఆలోచిస్తున్నాడు చుట్టా కుడూ ఇంతలో సుశీలా శ్యామలరావులు క్రొత్త బట్టలు కట్టుకొని వచ్చారు.

"కాళ్ళు చాపుతాన్నా. దణ్ణం పెడతాం" అంది సుశీల

"ఎందుకు తల్లీ" అంటూనే కాళ్ళు చాపాడు సీతాపతి సుశీలా శ్యామలరావులు ఒంగి ఆయన పాదాలకు నమస్కరించి లేచారు. తల్లి పిలవడంతో సుశీల గదిలోంచి వెళ్ళింది ఆమెతోపాటే శ్యామలరావు గదిగుమ్మందాకా వెళ్ళాడు సీతాపతి దృష్టి అప్రయత్నంగా ఒంటికి తగిలించివున్న కోటు మీదా, క్రిందపడివున్న చెప్పులమీదా పడింది మాసికలు వేసిన కోటూ, శిథిలమైన చెప్పులూ తనను వెక్కిరిస్తున్నట్టుగా వున్నాయి. "మామగారూ" అంటూ, శ్యామలరావు గది గుమ్మందగ్గరినుంచి వచ్చి పిలిచేప్పటికి సీతాపతి ఉలిక్కిపడి "ఏమిటి నాయనా!" అన్నాడు

"నాన్నగారు మీకి నూరు రూపాయలు ఇమ్మన్నారు బట్టలకింద మమ్మల్ని తీసుకురావడానికి మీరూ అత్తగారూ వస్తారేమో అక్కడే బట్టలు పెడదామనుకున్నారు మీరు రాకపోవడంవల్ల డబ్బు పంపించారు."

సీతాపతి ఆశ్చర్యపోయాడు. తను ఎరుగున్నంత వరకూ అటువంటి ఆచారమేమీ లేదని ఆయనకు తెలుసు. 'కావలసినంత సుశీలకు తెలిసివున్నట్లయితే మాట వరుసకైనా మా మామగారు ఇలా డబ్బు పంపించారని చెప్పేదే. ఒకవేళ శ్యామలరావే తన పరిస్థితి అర్థంచేసుకొని ఇస్తున్నాడేమో. ఏమైనప్పటికీ తాను తీసుకోవడం భావ్యంకాదు" అనుకుంటూ సీతాపతి "ఎందుకు నాయనా అనవసరంగా?" అన్నాడు

"అనవసరమేంకాదు తీసుకోండి మీరు వేరువిధంగా అనుకోవద్దు ఊ తీసుకోండి మళ్లీ సుశీల వస్తుంది" అంటూ శ్యామలరావు నూరురూపాయలనోటు సీతాపతికి అందించబోయాడు

సీతాపతికి ఏమిచేయాలో తోచలేదు మనసు రెపరెప కొట్టుకున్నట్లయింది ఒణుకుతున్న చేతిని చాపాడు తన దగ్గిరనుంచి డబ్బు తీసుకుంటానికి మామగారు పడుతున్న అవస్థను చూసి శ్యామలరావు జాలిపడ్డాడు మానసికంగా తాను ఆయనకు కష్టం కలిగించానేమోనని కూడా అనుకున్నాడు ఇంతలో "అక్కయ్య పిలుస్తున్నదిరావా" అంటూ సుశీల చెల్లెలు వచ్చింది శ్యామలరావు మరదలితో గదిలోంచి వెళ్ళిపోయాడు సీతాపతి నూరురూపాయల నోటును చేతిలో పుచ్చుకొని దానికేసే చూస్తూ అలాగే ఒక అరనిముషం నిలబడిపోయాడు "తీసుకోకుండా ఉండవలసింది పోనీ తిరిగి ఇచ్చివేస్తే అతనేమనుకుంటాడో! కష్టసుఖాలు తెలుసుకున్న అల్లుడు దొరకడం తన అదృష్టమే" అనుకున్నాడు సీతాపతి అతనికళ్ళు చెమ్మగిలినాయి. "మీరుకూడా లేచిరండి ఫలహారానికి" అని వంటింటి నుంచి భార్య పిలుపు వినవచ్చింది నోటు జేబులో పెట్టుకొని నీరసంగా అడుగులువేస్తూ గదిలోంచి వంటింట్లోకి వెళ్ళాడు సీతాపతి



మంగలం' అను గ్రామములో జన్మించెను. నేటికిని ఆ గ్రామమునం దతడు నిర్మించిన శివాలయములో అతని విగ్రహము గలదట. ఇతని కిద్దరు సోదరులు వైద్యనాథయ్య, కృష్ణప్పయ్య అనువారు. వీరిలో వైద్యనాథయ్య అగ్రజుడు. ఇతడనిన రామప్పయ్యకు అంతులేని అభిమానము. ఇతని ఆశీస్సులను గ్రహించిన పిమ్మటనే రామప్పయ్య రణరంగమునకు వెళ్లెడివాడు. రామప్పయ్య జామాతలగు శివరామయ్య, కొండప్పయ్యలుకూడ ఘటికులని వినదగుచున్నది. సేతుపతితో జరిగిన యుద్ధములో శివరామయ్యకూడ పాల్గొని విఖ్యాతి నార్జించెను.

రామప్పయ్య జీవితచరిత్రను, అతని జైత్రయాత్రా విశేషములను తెలిసికొనుటకు చారిత్రకాధారములు కొన్ని కలవు. కాని ఆశ్చర్యమేమనగా, రామప్పయ్య తెలుగుబిడ్డ యైనప్పటికిని నితని గూర్చి ప్రత్యేక పుస్తకములు తెలుగులో లేకపోవుటయే. నాకు తెలిసినంతవరకు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకాలలోనున్న 'రామనాథపురంవారి వంశావళి'లో రామప్పయ్యను గూర్చిన ప్రసక్తి—అనగా అతడు సేతుపతితో గావించిన యుద్ధమునకు సంబంధించిన విశేషాదికము—కలదు. కాని తమిళమున నితనిని గురించి 'ఇ రామయ్యన్ అమ్మానై' అను ప్రత్యేక పుస్తకమేగాక 'తిరుచ్చిరగోట్టు తిరుప్పణిమాలై'లో గూడ వివరములు కొన్ని కలవు. తంజావూరు పుస్తకాలలో, 'ఇరామప్పయ్యన్ అమ్మానై' అను తాళపత్ర గ్రంథమును, మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకాలలో 'ఇ రామయ్యన్ అమ్మానై' అను పుస్తకమును రామప్పయ్య గుణగణములను చిత్రించుచున్నవి. ఈ రెండు పుస్తకములను పోల్చిచూచి 'ఇ రామయ్యన్ అమ్మానై' అను పేరితో తంజావూరు సరస్వతీ మహాల్ ప్రచురణగా మదరాసు ప్రభుత్వమువారు 1950 సం॥న ప్రకటించియున్నారు. ఇందులకు ప్రభుత్వమువారు చిరస్మరణీయులు.

'అమ్మానై' అనునది దేశీ కవిత్వశాఖకు చెందిన మధురరచనము. శివాలయుగాలకథ, బొబ్బిలికథ, అత్యమ్మకథ—మొదలగు గ్రంథములవలె ఈ అమ్మానై ప్రబంధరీతిలో నే వ్రాయబడియుండును. [1]అచ్చన గాయలాడు సందర్భమున అమ్మానై పాడుచు ఆటాడుట తమిళ కాంతలకు పరిపాటి. కనుక తమిళనాడులో—ముఖ్యముగా పల్లెపట్టులందు—యీ రామప్పయ్య గాథకు విశేషప్రచారము కలదనుట అతిశయోక్తి కాదు. తమిళుల నోళ్ళలో పడిన రామప్పయ్యకు వింతవింత పేర్లు కలిగినవి. ఇరామయ్యర్, ఇరామయ్యన్, ఇరామప్పయ్యన్—అని నేటికిని వ్యవహరించుట మనదాపాము. తెలుగువాడగు రామప్పయ్య గాథను సజీవముగ నుంచినందులకు తమిళులకు కృతజ్ఞత తెలుపుటతోపాటు తమిళకావ్యయుమున గల మంచినిగూడ గ్రహించి శోధించుకొనుట తెలుగుల కర్తవ్యము!

ఇరామయ్యన్ అమ్మానై సాహిత్యదృష్ట్యా గణనీయము గాకపోయినను, చారిత్రకముగా వెలలేని రత్నమని నుడువుట లెస్స. రామప్పయ్య జీవితమునకు సంబంధించిన వివరములు, తిరుమల కౌరినాయకుని గుణగణములు, సేతుపతితో జరిగిన యుద్ధములో రామప్పయ్యకు సహాయముగావచ్చి పోరాడిన డెబ్బది రెండు పాళెగాళ్లు, ఆనాటి సాంఘిక, రాజకీయాది విషయములు, సేతుపతుల వృత్తాంతము, జడైక దేవ సేతుపతియొక్క శౌర్యసాహసములు—మున్నగు ముఖ్యాంశము లెన్నో యీ చారిత్రక గ్రంథమున వివరింపబడియుండుట గమనార్హము. దళవాయి రామప్పయ్యతో పోరాడిన రెండవ జడైకదేవ సేతుపతి కూడ పేర్వడసిన యుద్ధవీరు డనుటలో సందేహము లేదు. ఇతడు కుట్టాన్ సేతుపతి కొండటి కుమారుడు. కుట్టాన్ సేతుపతి మరణానంతరము, అనగా 1635 సంవత్సరమున జడైకదేవుడు సింహాసనమునకు వచ్చెను. ఇతనికి దళవాయి సేతుపతి యను బిరుదము గూడ గలదు. రామప్పయ్య, సేతుపతులకు జరిగిన యుద్ధమును వర్ణించు గ్రంథము రామప్పయ్యన్ అమ్మానై.

ఈ గ్రంథమునుండి రామప్పయ్యను గురించి మనకు తెలియవచ్చు కొన్ని ముఖ్యాంశములు: ఇతడు మహా సాహసి. స్వామిభక్తుడు. తిరుమల నాయని వారికి కుడి భుజము. ఇతని ఆంధ్రాభిమానము నిరుపమానము. అమ్మానైలో పలుతోట్ల 'నేను తెలుగు వాడను. జడైకదేవుడు తెలుగువారిని నిరసన భావముతో జూచుచున్నాడు. కనుక అతనిని వధించి గాని నాకు మనశ్శాంతి లభించదు—' అని. ధ్యా

1 ఈ అచ్చనగాయలకు అచ్చన గుండ్లు, అచ్చనలు, అచ్చనగండ్లు—మున్నగు ప్రఖ్యాతనామములు గలవని తెలియుచున్నది. పింగళి సూరనవంటి మహాకవి యీ ఆటకు చిరంజీవిత్వము కలిగించినాడు.

దినములో కొన్ని దినంగనంత గడుపరిన్ బొమ్మపెండ్లిండ్లు, గుజ్జనగూండ్లు, అచ్చనగండ్లు, పెంపిసులు, కుచ్చిళ్ళ, గీరనగింజ, లోమునగుంటల్, కనుమూసిగంతి, నలుగంచాలాట, లోనైన ఖేలనముల్ విరాళగోష్ఠితో నలరె బాలారత్న మెల్లప్పుడున్.
(కళాపూర్ణోదయము. 6 ఆ).

ప్పయ్య మరుపుట శోకకరము. పెద్దలైన అనరుల ముఖ్యముగా, అన్నయగు దైర్యసాధయ్యకైన విశేష గౌరవము. దైవభక్తి కూడ విశేషముగా నున్నట్లు తెలియుచున్నది. కాని కొన్ని సందర్భములయందు రామప్పయ్య కఠినాత్ముడుగా నున్నట్లు కనబడుచున్నాడు. దీనిని బలపరచునట్టి యొక కథ 'కొంగు మండలకతకం' అను తమిళ పుస్తకమున గలదు.

సక్రమముగా కప్పము చెల్లింపని హేతువుచే, రామప్పయ్య కొందరు పాళెగార్లను కారాగృహమున బంధించెనట. వారిలో అణ్ణూర్ 'సంబంధ చర్క్కరై' అను పాళెగాడొకడు కలడు. అతడు తమిళ భాషా పోషకుడుగా ప్రసిద్ధికెక్కెను. ఒకనాడొక కవి బంధితుడై యున్న 'సంబంధ చర్క్కరై'ను సందర్శించి యతనిచే సన్మానితుడగుటకు యత్నించెను. అప్పుడు తనయొద్ద ఏమియు లేకుండుటచేత సంబంధ చర్క్కరై తన భార్యను దర్శింపుమని కవిని కోరెను. ఆమెతో కవి యీవిషయమును జెప్పిన వెంటనే, తన మంగళసూత్రమును కవికి సమర్పించెనట. ఆ మహాయిల్లాలు! ఈ అద్భుతవిషయమును దళవాయి రామప్పయ్యకు తెలియజేసినవెంటనే పశ్చాత్తప్తహృదయుడై దళవాయి సంబంధ చర్క్కరై సచ్చరిత్రమును కొనియాడుచు అతనిని బంధవిముక్తునిగ జేసెను. ఇటులనే యుద్ధసమయములందు రామప్పయ్య బంధితులను బాధించెనని అపఖ్యాతి నుపుత్తుచున్నది

ఇక, రామప్పయ్య మరణమును గురించి విచారింతము. తిరుమలనాయకుని మరణమునకు సంబంధించిన కథలవలెనే, రామప్పయ్య మరణమును గూర్చికూడ కథలు పెక్కులున్నవి. సేతుపతితో యుద్ధమొనరించుటకుగాను రామప్పయ్య పాంబన్ కాలువపై ఆనకట్ట కట్టి, జడైకదేవునితో యుద్ధము చేయుచు వీరస్వర్గము నలంకరించెనని కొందరు చరిత్రకారులు విశ్వసించుచున్నారు. జడైకదేవుడు గావించిన 'వేటబడి' ఫలితముగా రామప్పయ్య మరణించెనని కొందరు నుడువుదురు. విషప్రయోగము వలన మరణించెనని మరికొందరి నమ్మకము. ఇటుల రామప్పయ్య మరణమును గురించి భిన్నాభిప్రాయము లున్నను, ఇతడు క్రీ. శ. 1658 ప్రాంతమున మరణించి యుండవచ్చునని నుడువవచ్చును. ఏలయన, యుద్ధమున మరణించిన రామప్పయ్యకు పిమ్మట, అతని అల్లుడగు లింగరామయ్య తిరుమలనాయకునిచే దళవాయిగ నియమింపబడెను. లింగరామయ్యకును, సేతుపతికిని జరిగిన యుద్ధములో సేతుపతికి పరాజయము కలిగినది కొన్నాళ్ళు జడైకదేవ—సేతుపతి మధురలో కారాగృహమునందుండి, తిరుమలనాయనివారి అనుగ్రహము తిరిగి సంపాదించుకొని మరల రామనాథపురమును పరిపాలించి, 1645 సంవత్సరమున జడైకదేవ సేతుపతి తన తమ్ముడగు 'తంబి'చే హత్యగావింపబడినట్లు రామయ్యగారి అమ్మానై నుడువుచున్నది కనుక, రణరంగమునందే రామప్పయ్య మరణించెనని నుడువుట సమంజసముగ కన్పించుచున్నది.

పయి నుదాహరించిన విషయము లన్నియు రామయ్యగారి అమ్మానైలో పేర్కొనబడినవి. ఒక్కొక చోట రామప్పయ్య 'పులిరామయ్య' అనియు 'రాక్షసులను సంహరించిన రాము'వంటివాడనియు ప్రస్తుతింపబడినాడు రామప్పయ్య, సేతుపతులకు జరిగిన యుద్ధము మనోజ్ఞముగ చిత్రింపబడినది. ఇటుల రామయ్యగారి అమ్మానై రామప్పయ్య జీవితవిశేషములనే గాక, ఆనాటి సాంఘికరాజకీయాది పరిస్థితులనుగూడ కండ్లకు గట్టినట్లు తెలియజేయుచున్నది. కాన, రామయ్యగారి అమ్మానై చారిత్రక దృష్ట్యా అమూల్యమగు గ్రంథమనుట నిర్వివాదాంశము. ఈ గ్రంథమున వర్ణింపబడిన రామప్పయ్య గాథ కూడ తెలువారికిని తగినదని నుడువుట అతిశయోక్తి కానేరదు. ప్రతిభాశాలియైన దళవాయి రామప్పయ్య జీవితచరిత్రము తెలుగువారికి మాత్రమేగాక తమిళులకు నెల్లరకు చిరస్మరణీయము!

---

# విరహి

శ్రీ కోదూరి ఉమామహేశ్వరం

నామనమెల్ల నందనవనస్థిత కోమల పారిజాత మా
లామధురాత్మకంబయి నిరామయభావ నిలీన గోపికా
కామనమై కృశించెడి నికంపిత ఖండిత నాయికా మృగా
క్షీహృదుకయ్యమై పరిమళించెడి గంధవు పచ్చిముద్దయై

వన్నెని మేటివంకల పినల్లు పినల్లు తురాయిపూలు పూ
యన్నజరైన తెక్కుతుదిఅంచుల సోలిన పాలపిట్ట కే
వన్నెలవైన నామెదద భావుకతా మధురోహ తెన్ని రూ
చిన్నెలు గ్రుమ్మరించుచును చేద్పడిపోయె రసావకర్షముల్

సుమధుర సాంధ్యరాగముల శోభలు చిమ్మిన యాకసంబుపై
గుమురుకవచ్చు రక్తిమను గూర్చి పసిండివలెన్ భ్రమించితిన్
విమలినమైన జీవితము తెక్కనమై తటిలీవు లారి తై
కము విడివడ్డ నాకునయి క్రమ్ముకువచ్చె విషాద మేఘముల్.

నలలిత పుష్పకోమల వసంత నదృతుము యౌవనంబు , నా
వలపుల పంట యీవనెడి భావన సేయుచు నున్ననాకు ని
ర్మల మధురోహ సమ్మిళిత రాగవిక్ష్యదునాద సంస్వరం
బులు విన గోక్కపుట్టెడినిపో-యెునకేక నహార్నికంబులున్.

కమ్మని పండువెన్నెలలు గాయు దినమ్ములు పోయి కృష్ణ`ప
క్షమ్ముక దాపురించునని సారెకు సారెకు నామెదుదలో
గ్రమ్మి విషాద మేఘపటలమ్ముల నిండిన చిమ్మ చీకటిన్
వమ్మయిపట్టె నాప్రణయవాంఛలకై తపియింతు నోసఖి !!

మదరని ప్రేయసీ ప్రణయ ముగ్ధ మనోహర ప్రేమగాథ నా
మది వదలించుచున్నది సుమా విసుమా యనుమాన మేలనో
సుదవతి ! నాటి నీమధుర మంజుల ప్రేమరసార్ద్రమూర్తి యై
హృదయము నేటికిన్ మధురవీక్షల నన్ను గృతార్థు జేసెడిన్

భావజాని చిత్తవృత్తి భావముల నెఱిగి
యుత్తమ గృహస్థ ధర్మంబు వృత్తి నెఱిగి
మదన సామ్రాజ్య వైభవాస్పదుల మగుచు
నాకనంబున విహరింప నభిలషింతు.

---



# సత్యాగ్రహం



శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

పూర్వం
ఉండేది మనుష్యుల్లో సత్యాగ్రహమొకటి
అది దేవతరాల్లో
ఒక కరవాలంగా నిలబడి
ఆమె నడచుదారుల్లో పొంచిఉన్న దౌర్జన్యాన్ని
సమూలం చెండాడ్తూ
ఆ దొంగతనపు దాడులలో
మోసపునీచుల చెల్లాచెదర రౌవరించుటలో
ఉపయోగపడే దప్పుడు

అసిపిడిపై పిడికిలి చేసి బిగించిందా
ఆ నారకలోక దురాచారాసురుల
కనుకుటి దట్టపుచీకటి ఛటలను
కదలి కదలిరా భయపడి చక్కా పోకమూలం.

కాని
ఈరోజుల్లో దుష్టశిక్షణార్థం
దేవిదాడి సలిపే అవసరమున్నప్పుడు
చూశారా ఆ ఆయుధమెవరన్నా ?
ఊరక నిలబడి చూస్తున్నది
దేవిచేసు అన్యాయాన్ని !

కళ్ళు జిగ్గుమనిపించే అసుర కాంతిపుంజం
అనుభవీమను
పిల్లుపలై ప్రవహించకపోవడం వల్లను—
దౌర్జన్యభూత కార్యం అగాకిచి
కాన్ని నిలుపలేక లేకుండా
నిరంతరాలా కనుమరుగులు
కాలభద్ర ప్రకోపాత్మక పక్షము
ఆ శివ్యజనాళన హస్తాల్లో.

నిలువకుండడం వల్లను
ఈ పాతాళ పిశాచుల విశ్వతాండవాలు
నిగ్గించే లేకుండా
ప్రతిద్వంద్వి మొగం దూసి
పరిహసింప సాహసించు !

ఆ మనుపటిరోజుల్లో తొడిగిన ధర్మకవచమే
అనాటి శిరస్త్రాణమె
ఈనాడూ అంగాన ధరించి
సదాసిద్ధంగా ఉన్నదిదేవి
కాని నిర్వాణ్యంగా
కాపట్యం మొదలంటా పెల్లగింప
ఆమె అశ అశక్తురాలు—
సత్యాగ్రహం లేదుజగతి .
లేదు దేవిచేతకత్తి

## 2

ఓ దివ్యకృపాణం !
మరొక్కసారి మాదేవి కరాలకు రావా ?
పరమాత్మవిబంబై ఆమె మరల
మా భూముల్లో విర్రవీగిన పాపపుపంటను
మొదలంటగ కోయగా ?
ఓ అమరశక్తి సంకలితాగ్రహమా !
సత్యరౌద్ర జనితాసీ !
సృష్టిసమస్తం
మహోగ్రార్తమై ఉన్న దినంగా
బాహాగంధరగోళంగా ఉన్నప్పుడు
దుర్భరతమా ప్రాణభయాల్లో
ఆనందానికి వ్యతిరిక్తంగా ఉన్న ప్రతీదాన్ని

సమూలముగ నాశనం చేసితోలి
భగవానుడు స్వర్గాలు సృజించిన సమయంలో
క్రమవిహీనముగు విలయ ప్రకృతిపయి
దాడివెడలి పోసలిపి
ఆ మహత్వంనుండి
ఆ నేక పవిత్రమండలాయా
పిరితారా తరళహారి
సృష్టించావు గదమ్మా!
మూసిన ఏకాస్త్రాగారంలో బందీవివ్వాకు ?
నీ నిరి విరిశ కవద్వారలు త్రుప్పెక్కినవా ?
ఓ నక్షత్రరాత్ర జనితాసీ!
అమరశక్తి సంకలితాగ్రహామా!
ఆ క్రూరపిశాచముల వక్రపతాకల ఔద్ధత్యం
ఎదిరింపగలిగేవాడీ, సత్యాగ్రహశక్తి శేదీ,
సుమ్నాలై పోతదాన్ని
దుష్టశక్తు కౌయునకేంది లేకుండా
ఇప్పాకైశ్యే అసహాయగ నిలబడి ఉన్నదిజేవి
ఆమెశలి కదలాడ్తూ
మాపాలాల పరిశుభ్రం చేయగరావా?
మహారాత్ర భారంతో తన దోర్దండాలూగులాపి,
తనచుట్టూ విసిరే గాలివింపె
కేడిపాగల సెగలెగయగ,
మరల చెదలనీ మహోత్సాహం
ఆమె మనస్సీములో!
పరమప్రభు క్రోధాలు, బృహద్వహ్నులు,
మరల పొదలనీ ,రాతలంలో!
ఓ నక్షత్ర రాత్రిజనితాసీ!
అమరశక్తి సంకలితాగ్రహామా,

## 3

ఆరోజుల్లో
మానవుని మనస్సులం
పవిత్రనీమగా ఉంటేది
తేరిమాపరాని తెల్లదనంతో
జరిగే పెద్దమంటలో
విసురుగ కదలుతూ, సుళ్ళుతిరుగుతూవచ్చే
ప్రళయానిల సంఘాతాల
భయంకర దంష్ట్రాగ్రాలంచే
గుండెల్లో చెదురగుటను

దుష్ట పరశక్తులు
ఆ పవిత్రమందిరం గడపే త్రొక్కుదలుస్తే
అతి జాగ్రత్తగ నడిచేది
కాని ఇప్పుడిప్పుడు
సత్యాగ్రహశక్తి అసలు
యుద్ధానికి సంసిద్ధంగా లేకుండుటవల్లను
ఆ రాక్షసశక్తులు
పట్టపగలే పాలిస్తున్నాయి ధరనంతా.
విచ్చలవిడిగా విజృంభిసుకూ
మనుజాని హృదయా న్నాక్రమించుకొంటు
న్నాయి!
ఆ పదాల కదలికలను
దొంగచాటు దనంలేదు.
రకరకాల వికృతికెకటాల దర్పాల్లో
మస్తేసిన ఎురదముట్టిలా
నేడా అసహాయ మనస్థలమంతా
తమ ఉన్మత్త పదాల అర్థహీన ప్రదలకాల.
ఎత్రొక్కుడి పెనుత్రొక్కుడి చేస్తూ
ఆ మార్దవమంతా మాపేస్తున్నాయి!
అమర కాంతులేవో
నిరంతరం నవ్వుయానే దారులతో,
చలువలనొలికే గాలులతో,
భగవన్మందిరమే అనుగ్రహముకలిగించే పల్లతో,
అసురుల అమృతపు బిందులతో కలకలలాడే
రాత్రులతో,
అతి సుందరమౌ మానవ మేధా వాతావరణం
చూసిసహించగలాలక పోయిందా నారకపాతక
బృందం
కాపట్యపుటన్నలను రగుల్కొల్పి,
కెంజాయలతో భయంకరంగానుండే సంజల్లో
పొగమారిన అసుభత్వంనిలబెట్టి,
కాళమేఘపటలాంధతమంతో
సర్వాన్నీ ఆవరించి,
పగటివెలుగు మాయచేసి
తమ కనుకూలంగా ఉండే వాతావరణం
సృష్టింపగ మొదలిడిందా అసురశక్తిగణం
మనుజాపునకు మిన్ను మీద
ఇసుకతుపానులు మువ్వులు
విసురగ వేలాడచేసి

విలువెంతో తెలియని
జీవితాలిలా
దుర్వ్యయమైపోవడం న్యాయం కాదా?
శవాల్ని పీక్కుని తిని బ్రతికే
రాబందుల్లా
మనమమానుషంగా
కోట్లకొలది తోడివార్నిలా
కడుపు కరుక్కునిపోయే పేదరికంలో
అణగార్చడమేనా?
చిలుకల కోకిలంకోరికే పిల్లలమై
పసిపాపలమనసుల వికసింపగనీయక
నమిలేస్తామా ఈలాగున?
తిండిలేక మాడడానికో—
లోహచక్ర పైశాచికవిజ్ఞానం
మానవ వివేదనాకీర్తి
భయంకరంగా ఆకర్షిస్తూ,
అంతులేని రహాశ్చర్యంతో
తమ ఉన్మత్తావర్తుల భ్రమణ
హృదయ విదారణ దారుణ
భీషణ ఘోషణలతో
కార్మికుల హృదంతరాలు
దొంగిలించివేయగా
చివరకదట
మానవులే నిర్జీవ పదార్థాలుగ
యంత్రాల్లో భాగాలే జీవంగలవస్తువులుగ
మారే యమసదనాల్లో
కబళ్ళు క్రమించడానికో—
రాక్షసత్వమునతోడివార్నిలా పేదరికంలో
అణగార్చడమేనా?
మన కార్యకలాపాల్లో
ఒకసారైనా
సౌందర్యమనే మాటను
తలపెట్టగలోమా ఇక?
చేయడానికింకేం లేదా
దైవానికి మొరలిడుకోడం మినహా?
ఛీ, ఛీ, ఇంత అశక్తులమా?
పాశవిక శక్తులమా!

* * * *

ఒకనాటి మానవసంఘంలో
కదలాడిన సత్యాగ్రహార్తి
మరి ఒకమారీ కుళ్ళు ప్రపంచంలో
కదలే సుదినం రాదా!
అపుడు దేవి దుఃఖభరంతో
కనుకొలకుల జార్చదసలు
దుర్బలరై అశ్రుధార!
ఒక్కుదుట వేస్తుంది!
క్రోధపూర్ణ తీక్షణహస్తి
కదలాడే పిడికిల అనిఒక్క '
అపరమాతృని దివ్యరౌద్రిక
తనకేల చలిస్తుంటే
ఆమె మనస్సంతా
ఉత్సాహంతో
పొంగి పొరలుతుంది!
నరకంలో
ప్రళయపు 'క్యారీ' గుట్టలలో
రాయిరప్పు సంతరించి
తన్ను కాలుపెట్టనీక
మానవజీవిక చుట్టూ
దుష్టశక్తులలాకట్టి
నిలబెట్టిన గోడలు
ప్రవాదుల్లో దేవి
నేలబడ గొడ్తుంది!
కృతక కారకవ్యూళ్ళి
అన్యాయపు వ్యాపారాన్ని
పేరాసలయాజమాన్యమునకు పోహదమగుపద్ధతుల్ని
ఒక దెబ్బకు తెగగొట్టుంది
దీక్షాపరతంత్ర, దేవి,
సత్యాగ్రహ తరకలనితనిత నిశితాసి ధారతో!
ముక్కముక్కలై, పొగలై,
ఈ దౌర్జన్యాలన్ని
మచ్చునకన్నా కనబడకుండా
మాయమైపోతాయి ప్రపంచంలో!
అన్యాయం మనస్సులో
మరణభీతినించే స్వరకల్పనతో
విలయగీతికలు పాడుతుందప్పుడు దేవి!
తిరిగి
తనవిశాల రాజ్యవీధుల్లో
ఊరేగుతుంది

# చంద్రేణైకపుత్రః

శ్రీ శ్రీనివాస శిరోమణి

"అక్కయ్యా, బాబ ఏంచేస్తున్నాడు" అంటూ పొద్దుటే కరణము రామయ్య వచ్చి సుబ్బమ్మను అడిగినాడు

"ఊరెళ్ళింది పంతులూ, నిన్న ఉదయము పొలంపోయినారు ఇంతవరకూ రాలేదు రాత్రికి వస్తాను అన్నారు" అన్నది సుబ్బమ్మ

"ఎందుకు పోయినాడు?"

"అక్కడ వారి తోటలో ఎవడో పిల్లగాడు ఉన్నాడట. వాణ్ని పెంచుకోవలసింది అని వారి వారు అందరూ పట్టుపట్టినారు ఆ పిల్లవాణ్ని చూడ టానికి పోయినారు"

"అదేమిటి అక్కయ్యా, బాబకు మతిపోతే పోయింది, నీకుకూడా మతిపోయిందేమిటి?—ఏ ఒక్క చోటనైనా పెంపుడు కొడుకు అక్కడము కాని పెంచుకొన్న తల్లిదండ్రులకు ఉపయోగ పడ టము కాని చూచినావా! లేనిపోని తద్దినం పెంపుకు అంటే తగాదా కొనుక్కోడము అన్న మాట ఈ శాస్త్ర విషయము నీకిట్లా తోచలేదు" అన్నాడు రామయ్య

"పంతులూ, మా బాబగారి సంగతి నీకు తెలి యనిదేముంది? అనుకొన్నట్లు చేసి తీరవలసిందే"

"కాదు లేదమ్మా, నీకు తోచినట్లుండదు లేక పోతే నీవు చెపితే బాబ వినకపోవటము ఏమిటి?—

"అయితే నాయిష్టముతోనే మా బాబగారు ఈ ప్రయత్నము అంతా చేస్తున్నారు అంటావా?"

"సుతరామూ."

సుబ్బమ్మ ఒక్కసరి నవ్వింది. "సరే ఆయన గారు రానియ్యి చూదాము" అన్నది.

"అయితే అక్కయ్యా, నీకు పిల్లలు కనే వయస్సు మళ్ళింది అంటావా?"

"ఇంకేమి పిల్లలు నేను కిందటి గాలివాన ఇంకా అయిదు సంవత్సరాలకు కొదువుంది అనగా కాపురానికి వచ్చినాను గాలివాన కొట్టి ఎన్నేళ్లు అయిందో లెక్క చెప్పు"

"గాలివాన కొట్టి ఇప్పటికి పాతికేళ్లు అయింది ఏమోలే—నీ కడుపున ఒక కాయ కాయ కూడదూ" అన్నాడు రామయ్య

"చాలులే—నీ చమత్కారము నలభైయయిదు దాటిపోయినవి ఇంకా పిల్లలు ఏమిటి"

"పోనీలే—నీవు పిల్లలను కనలేక పోయినా మా బాబకు పిల్లలు పుట్టే వయస్సుమాత్రము మళ్ళలేదు"

సుబ్బమ్మ నవ్వింది కాని ఆమె ఊహలు ఎక్కడెక్కడికో పోయినవి ఒక్కసారి రామయ్యను తేరి పారచూచి "నిజమే పంతులూ, నీవు అన్నట్లు నా పిల్లవాడు కాకపోయినా ఆయనగారి పిల్లవాడు అయినా కొంత నయమే" అన్నది

"అదేనమ్మా నేనూ చెప్పుతూంటుంది" అని రామయ్య అంటూ ఉండగా కిరుచెప్పులతో గ్రామ మున్సబు నారయ్య వచ్చినాడు రామయ్యను చూస్తూ "పంతులూ ప్రొద్దుటే వచ్చినావు, ఏమిటి తహశీల్దారు మన ఊరు వస్తున్నారు అని కబురు ఏమైనా పంపించినాడా" అన్నాడు

"అదేమీ లేదు ఒక జోష్యి మన ఊరువచ్చి నాడు. ఆయన పాండిత్యము మీరు పరీక్షించవలెను"

"ఇంతకూ నీకు ఆయన ఏమి జోస్యము చెప్పి నాడు" అంటూ నారయ్య కుర్చీలో చేరగిల బడి నాడు.

"ఇప్పుడు ఉన్న వాండ్లు చాలనట్లు ఇంకా నలుగురు ఆడపిల్లలు పుట్టుతారు అన్నాడు"

గ్రామములో పోట్లాటలు వచ్చి పార్టీలు పడి గడ్డి వాములు తగులపెట్టుకోడము కానీ వారి గొడ్లను వారూ వీరూ వీరిగొడ్లను వారూ మందులుపెట్టి చంపి వేయడాలు గానీ లేవు ఇన్ని మాటలెందుకు—అది బస్తీపక్కనే ఉన్న పల్లెటూరు. అయినప్పటికిన్నీ ఒక సివిల్ వ్యవహారము కానీ ఒక క్రిమినల్ వ్యవహారము కానీ ఊరుదాటి కోర్టుకు పోయింది లేదు

నారయ్యగారి అంత కుంకుమబొట్టు పెట్టుకొని లోపలినుంచి బయటకు వచ్చినాడు అప్పటికే జోస్యుల్లుగారున్నూ వచ్చినాడు జోస్యమ్మ వినడానికి సుబ్బమ్మగూడా వచ్చి తలుపుచాటున నిలుచున్నది నారయ్యజోస్యునివి ఎగాదిగా చూచి "బాలజ్యోతిషం వృద్ధవైద్యం" అన్నారు. బాగుంది జోస్యులూ జాతకము ఇవ్వగానే ముందుగా ఏమి ఆలోచిస్తావు?" అని ప్రశ్న వేసినాడు

"ఆయుర్దాయాన్ని గురించి ఆలోచిస్తాను"

"అయితే ఈ జాతకానికి ఆయుర్దాయము చెప్పు" అంటూ జాతకచక్రము ఉన్న కాగితము నారయ్య జోస్యులకు ఇచ్చినాడు రామయ్య "జోస్యులు బాబూ లగ్నము ఏమిటి—నక్షత్రము ఏమిటి" అన్నాడు.

"మేషలగ్నము—మఘానక్షత్రము" అంటూ "జాతకుడికి దీర్ఘాయుర్దాయము పట్టింది జాతకము మహాదొడ్డది ఒక్క పంచమ భావానికి తప్ప మరి ఏ ఇతర భావానికీ ఏదోషమూ లేదు పంచమాధిపతికిన్నీ పంచమ స్థానానికిన్నీ పాపార్గళం పట్టింది పుత్రకారకుడు అయిన "

"ఇదుగో జోస్యులూ మాకు శాస్త్రము గోల అంతా అక్కరలేదు ఫలము చెప్పండి" అన్నాడు నారయ్య

"ఇప్పటికి సంతానము లేదు" అన్నాడు జోస్యుడి.

"సరే ఇకముందు సంగతి?" అన్నాడు రామయ్య

"అయితే కర్మస్థానాధిపతి అంటూ."

"దత్తుచేసు కొంటానేమో చెప్పవయ్యా" అన్నాడు నారయ్య.

"దత్త పుత్రయోగములేదు."

"దత్తు చేసుకొంటే"

"దత్తత చేసుకోటము ఉండదు. అథవా దత్తత చేసుకో తలచుకొన్నా కానపోగదు. విఫలము అయిపోతుంది"

"అంటే"

దత్తుకు ఇంటికి రాగానే చస్తాడు"

"అమ్మనాయనో—పుత్రశోకమకన్నా దత్త పుత్రశోకము పట్ట కష్టముకాదు అన్నారు పెద్దలు" అన్నాడు రామయ్య నారయ్య ముఖము వెలా వెలా పోయింది

"అయ్యా ఈ జాతకములో ఉపపదానికి చంద్రశుక్ర సంబంధము పట్టింది కాబట్టి తీవకళత్రము ఉంటుంది. కర్మస్థానము బాగాఉంది కర్మకారకుడూ కర్మాధిపతీ బాగా ఉన్నారు "శుభదృగ్యోగాత్సుందరీ" అని సూత్రము మంచి అందకత్తెను జాతకుడు కొద్ది రోజులలో పెండ్లి చేసుకొంటాడు "వ్యయకళేసుప్తాడ" "చంద్రే లైకపుత్రః" అనే సూత్రాలున్నూ జాతకానికి అన్వర్తిస్తవి ఆ అందకత్తెకు ఒక పిల్లవాడు పుట్టుతాడు. వాడు ఈ జాతకుడికి కర్మాధికారి అవుతాడు. తప్పదు"

నారయ్య పకపకా నవ్వినాడు సుబ్బమ్మ తీవ్రముగా ఆలోచించడము మొదలు పెట్టింది. రామయ్య "శాస్త్రులవారూ, సంతానము ఇంకా ఎంత కాలానికి కలుగుతుంది" అని ప్రశ్నించినాడు

"ఎక్కువ ఎంతో కాలానికా—ఇప్పుడు కర్మాధిపతి అయిన శనిదశలో కుటుంబాధిపతి అయిన శుక్రభుక్తి నడుస్తాఉంది కొద్దిరోజులలో తీవకళత్రమూ ఆ తరువాత—కేటికి పదహారు మాసాలలో జాతకుడికి కర్మచేసే పిల్లవాడు పుట్టుతాడు "

"అట్లా నిజముగా పదహారు మాసాలలో పిల్లవాడు పుట్టినట్లయితే మీకు నూటపదహార్లు బహుమానము ఇస్తాను" అన్నాడు రామయ్య

"తప్పకుండా నూటపదహార్లూ బహుమానము పుచ్చుకొంటాను" అన్నాడు జోస్యుడి. నారయ్య పది రూపాయలు తాంబూలములో పెట్టి జోస్యునివి సన్మానించినాడు. రామయ్యతో జోస్యుడి వెళ్లిపోయినాడు. నారయ్య పెండ్లాన్ని చూస్తూ "నేను దత్తుచేసుకో

అంతా అంధకార బంధురముగా ఉంది. తలుపు ఏ వైపున ఉంది కిటికీలు ఏ వైపున ఉన్నవి చటుక్కున తోచలేదు. వసారా పెంకులు లేచిపోతూ టపీల్ టపీల్ మంటూ చప్పుడుచేస్తూ ఉన్నవి. ఆమెకు భయము వేసింది. "సురవా—సురవా" అని కేక వేసింది. జవాబులేదు. ఆ చీకటికి కన్నులు అలవాటుపడ్డవి. కిటికీలూ తలుపూ లీలగా కనిపించినవి. ఎట్లాగో ధైర్యము చిక్కబట్టింది. తలుపు తెరిచింది. దీపము లేదు. లాంతర్లుకూడా వెలవడములేదు. మధ్యమధ్య మెరుపులు పట్టపగలు అంతటి వెలుతురు వేస్తూ ఉన్నవి. వాగ్గుజాతల ఎద్దులనూ పాకలో వదిలిపెట్టి సురవడు బయటికి వస్తున్నాడు.

తలుపుప్రక్కన మెరుపు మెరిసింది. గొల్లకొట్టము మీద పెంకులు గాలికి ఎగిరిపోతూ ఉన్నవి. చిమ్మిరి గొట్టములోనుంచి నీళ్లు కొట్టుతూ ఉన్నట్టుగా వాన దంచుతూ ఉంది. బిత్తరపోయి చూస్తూ నిలుచుంది. చూడి గడ్డకూ పాడి ఆవులనూ సురవడు ఇంటిలోకి తోలి లక్కవ గొడ్లను బయటకు పోవడానికి పెం తాళ్లు వదిలివేసినాడు.

"అమ్మగారూ కొట్టములో బర్రె ఈనేట్టు ఉంది. బ్యాటరి దీపము ఎక్కడుంది?" అన్నాడు సురవడు. అదృష్టవశాత్తూ బ్యాటరి దీపము పెద్దది మంగమ్మకు దొరికింది. దీపము వేసి చూసింది. పెంకులు అన్నీపోయిన ఆ కొట్టములోనే బర్రె ఈనుతూ కనిపించింది. దూడను సురవడు ఎత్తుకొన్నాడు. తల్లిగేదెను ఇంట్లోకి తీసుకొని రావడానికి మంగమ్మ దారి చూపుతోంది. ఒక చేతిలో పట్టుకొంది. రెండో చేతిలో బ్యాటరి దీపము పట్టుకొని నడిపిస్తూ ఉంది. ఉత్తరపుగాలి పమరకు తిరిగిపోయింది. నడవలేక నడవలేక నడుస్తూ ఉంది. గాలి ఒక్క విసురు విసిరింది. మంగమ్మ కాళ్లు నిలపలేకపోయింది. ఎల్లకిలా పడ్డది. సురవడు పరుగెత్తుకొనివచ్చి పసిపిల్లను రెండు చేతులలో ఎత్తుకొన్నట్టుగా మంగమ్మను ఎత్తుకొనివచ్చి మంచము మీద పడుకోపెట్టి "అమ్మగారూ నడుములు నొప్పిపట్టినవా?" అన్నాడు.

"లేదురా—కాళ్లు నిలవలేదు" అన్నది.

"అమ్మగారూ—గేదెనూ దూడనూ నేను చూసుకొంటాను. మీరు తడిసిపోయినారు. ఒళ్లు తుడుచుకొని స్వస్థముగా పడుకోండి" అని చెప్పి సురవడు అవతలకు వెళ్లినాడు.

* * *

డాబాగది అయినప్పటికిన్నీ కిటికీలుమూసి వేసి ఉన్నప్పటికిన్నీ గాలి రంయ్యమని వస్తూ ఉంది. గోడపక్కన కోలమీదపెట్టిన లాంతరులో దీపము గంతులు వేయడము మొదలు పెట్టింది. మంగమ్మ ఒంట్లో కొంగరపోతూ ఉంది. తలగరాగరా తుడుచుకొని చీర రవిక తీసివేసి ఒళ్లు తుడుచుకొని పెట్టెలో చీరకట్టుకొంటూ ఇటు చూచింది. సురవడు వాకిలిపక్కన నిలుచుని ఉన్నాడు. వాడు తనను చూచినాడా అనే సందేహమువచ్చింది. చీర కట్టుకొంటూనే "సురవా ఏమిచేస్తున్నావు" అని అడిగింది.

"చలికి వణుకుతూ ఉన్నాను" అన్నాడు.

బ్యాటరీదీపము వేసి వాణ్ణి చూచింది. నిండు ఒంట సురవడు వణుకుతూ ఉంటే వాడి దేహమూ—పాము పొట్టవంటివాడి పొట్ట—కండలతో ములుపులు తిరిగిన వాడి జబ్బలూ మంగమ్మకు గమ్మత్తుగా తోచినవి.

"ఒరేయ్ చలికి ఎందుకురా అట్లా వణుకుతావు" అంటూ పెట్టెలోనుంచి తువాలూ పంచే తీసి "ఈ తువాలుతో తుడుచుకొని ఈపంచె కట్టుకో" అన్నది మంగమ్మ.

"పంచే తువాలూ దొరగారివి" అంటూ అనుమానించినాడు. మంగమ్మ ఒక్క నవ్వు నవ్వి "ఇప్పటికు నీవే దొరవు" అని వాడిముఖము వంక చూచింది. వాడికి సిగ్గువచ్చి తల వంచుకొన్నాడు. ఆమె చేతులో ఉన్న బ్యాటరీదీపములో బ్యాటరి అయిపోయింది. గంతులు వేస్తూ ఉన్న దీపము ఎప్పుడో ఆరిపోయింది. అంతా చీకటి గుయ్యారముగా ఉంది. గాలివానా మరింత జోరు అయింది. మంగమ్మ వణుకుతోంది. ఆమె ఒళ్లు అంతా తిమ్మిరి తిమ్మిరిగా ఉంది.

"సురవా" అని పిలిచింది.

"ఆఁ" అని పలికినాడు.

"ఒరేయ్ నాకు భయము వేస్తూ ఉంది. నీవు ఇక్కడకు రా" అన్నది. వాడు ఆ చీకటిగదిలోకి వచ్చినాడు.

* * * *

గాలివానవాడు రాత్రి ఇంటి కాపలావాడూ సురవడూ తప్ప ఏ జీతగాడూ ఇంటో లేనందుకు నారయ్యకు పట్టరాని కోపము వచ్చింది. కాని ఎవరినీ ఏమీ అనలేదు గొడ్లకొట్టము కొట్టుకొని పోవడము తప్ప ఏ నష్టమూ లేకుండా పోయినందుకు మనస్సులో సంతోషించినాడు గొడ్లకొట్టము పెంచి జీతగాండ్లు అందరూ ఉండడానికి బందోబస్తు అయిన భవంతి వేయించడము మొదలు పెట్టినాడు

సుబ్బమ్మ తాతగారు చనిపోయినాడు దిన వారాలు అయిన తరువాత ఎంతో దుఃఖముతో ఇంటికి తిరిగివచ్చింది గాలివానకు ఏ నష్టమూ రానందుకు ఆమె సంతోషపడ్డది గొడ్లకొట్టము పెంచి జీతగాండ్లు కూడా తమ ఆవరణములోనే కాపురాలు ఉండే ఏర్పాట్లు నారయ్య చేస్తూఉన్నందుకు ఆమెకు మరింత సంతోషము వేసింది

అంతవరకూ మందకొడిగా అయోమయముగా ఉంటూవచ్చిన సురవడు మహా హుషారుగా పనులు చేస్తూఉండడము చూచి ఆశ్చర్యపోయింది అందులో పలకరించినా మాట్లాడనివాడు ఎవరు ఏమి అడిగినా తడువుకోకుండా సురవడు సమాధానాలు చెప్తూ ఉంటే సుబ్బమ్మకు మరింత ఆశ్చర్యము వేసింది

మంగమ్మకు నెల తప్పిపోయింది సుబ్బమ్మ సంతోషానికి మేరలేకుండా పోయింది మూడు నెలలు గడిచినవి మంగమ్మకు కడుపువచ్చినట్లు రూఢి అయిపోయింది ఆమె కొడుకును కంటుందో కూతురును కంటుందోనని అందరూ ఆలోచించ సాగినారు. ఆ ఇంట్లో ప్రతిరోజూ అచ్చట్లూ ముచ్చట్లుగా ఉండి ప్రతిక్షణమూ పండుగగానే ఉండి ఊళ్లోవాండ్లు, అందరూ పండ్లు పసుపు కుంకమూ పట్టు రవికెగుడ్డలు, పట్టుచీరెలు తెచ్చి ఇవ్వసాగినారు. ఆ ఊళ్ళోవున్న బ్రాహ్మణఇండ్ల ఆడవాండ్లు కూడా యథాశక్తిన పసుపూ కుంకమూ తెచ్చి ఇచ్చినారు మంగమ్మకు కొడుకు పుట్టవలెనని అనే అందరూ కోరుకొన్నారు తొలికాన్పుకి సుబ్బమ్మ కూడా ఇక బిడ్డలను కంటుంది అని అన్నారు.

ఇల్లు అంతా ఎంత గబగబలాగా ఉన్నా ఎంత కోలాహలముగా ఉన్నా సుబ్బమ్మ వెయ్యికళ్ళతో సురవణ్ణి కనిపెడుతూఉంది నారయ్య ఏదో వ్యవహారముమీద మళ్లీ ఊరికి పోయినాడు. రాత్రిభోజనాలు అయినవి వదినలు ఇద్దరూ కబుర్లు చెప్పుకొంటూ తాంబూలాలు వేసుకొంటున్నారు. సురవడు యథాప్రకారము చావిడిమీదికి మంచినీళ్ళు నగరిరాలు తీసుకొనిపోతూ మంగమ్మ వంక చూడసైనా ఆమె వాడితో శ్రద్ధావధానము చేయడమూ కనిపెట్టింది. ఏమి తెలియనట్టుగా అమాయికముగా "చెల్లెలా— వారు ఊళ్ళో లేకపోయిన పయిన పడుకోడము ఎందుకు నీకు డోకువచ్చినా ఒళ్లు తిప్పినా పైనుంచి నీవు కేకలు పెట్టితే మేము లేస్తామా— లేకపోతాము కాబట్టి కిందనే పడుకో"మంటూ సుబ్బమ్మ మంగమ్మ ముఖము తేరి పారచూచింది

"అక్కా నాకు ఆమంచముమీద పడుకొన్నట్టుగా ఏమంచముమీద పడుకొన్నా ఉండదు"

"అయితే ఆ మంచమే ఇక్కడికి తెప్పించేది"

"నాకు ఆ మరలుతీయడము చేతకాదు"

"చేతనయినా వాండ్లే తెస్తారు" అంది ఆ మంచాన్ని అప్పటికే అప్పుడు కిందికి తెప్పించింది మంగమ్మ తీవ్రముగా ఆలోచించింది ఆమెకు భయము వేసింది ఉత్తరక్షణమే ధైర్యము తెచ్చుకొన్నది సుబ్బమ్మ తనమీద ఏ పేచీ చేతనే అట్లా చెప్పి ఉంటుంది అని నిర్ణయించుకొన్నది కాని ఆమె బుర్ర పరిపరివిధాలపోతూ ఉంది

"చెల్లెలా—నిద్రపోతున్నావా" అంటూ సుబ్బమ్మవచ్చింది

"లేదు" అన్నది మంగమ్మ

"ఏమిటి ఆలోచిస్తున్నావు?"

"ఏమీ ఏమీ లేదు"

"ఇక రేపటినుంచి నేనే గొడ్లూ గోడా చూచుకొంటాను మీ అమ్మకు వంట ఇల్లు ఒప్ప చెప్పతాను సురవణ్ణి వంటపనిలోనుంచి తగ్గించి వేయవలెను అనుకొంటున్నాను"అన్నది సుబ్బమ్మ

"మంగమ్మ చూస్తూ ఊరుకుంది.

"చెల్లెలా ఎందుకు అట్లా చూస్తావు వాణ్ణి అవతలే పంపించి వేదామా అని కూడా అనుకొంటు న్నాను"

"మీ ఇష్టము"

# వసంతగీతము

★

శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

పొడి పొడిమై, తలల్ విరియ బూసిన వేపయిపుళ్ల జొంపముల్,
గడుసరి పిల్ల గాలులకు గాదిలి నీలి కొమ్ముళ్ల లీలగా,
సుడివడి నాయెడంద, చిరుసోనలు వాఁ, మరంద మోదముల్
గడలు కొనెన్ త్రపా మధుర కాంతులు రేగి తరంగి తెత్తగా !

ఇది మధుమాస వేళ-వికసించిన పూలతవల్ సువిస్ఫుర
న్మృదుకలగీతికావిహృతి దేలి, కెరల్ దలుకొత్తగా రసా
భ్యుదయ కలా ప్రవేశికల నూమెల లూగుచు సాగిపోవు, నా
యెద గదలున్ విచిత్రముగ నీ చివు రెత్తిన చావుటాలెపో !

కడు వలయించు పీడకలగా దరలన్ గతకాల మెల్లదో
చెడు వికృతమ్ముగా, చినిగి చీవరమై, బ్రతుకంత బ్రోడుగా
జడిసి, హిమావృతమ్మయిన ఛాయలలోబడి నిల్చి నిల్చి యా
యెడ మధురోహలూదుకొననీ నవశాద్వల భాసురస్థలిన్

ఒక చిరుసోనగా పృథురసోత్కటనే ప్రవహిల్లి పోదునో !
ఒక విరబూయు మావి నయి, యొయ్యన నిల్తునో రాగమూర్తినై
ఒక పికగీతిగా, నళినవోదిత ఝూంకృతిగా మలంగి నే
నిక మెరయింతునో ! గిరుల యింగము లబ్ధినిజాశయమ్ములున్

నిన్నటిదాక మూగవడి నెవ్వల బ్రుంగిన కోటిగొంతులీ
యున్నన విచ్చి బ్రోసినటులయ్యె, చీకారపు వేగు రేకలో
క్రన్నన శృంఖలల్ దెమలి గగ్గల లాగుచు నేలరాలి యా
మిన్నుల త్రోవలెల్ల మిసిమించె ప్రభాత పతంగ గీతులన్ !

తెలిరేకలు దిరి బంగరు
కలలగు జలజాతమాలికల దీపితనై
వలగొను పలుకుం జెలికై
శ్యలవారి మును గాడు తలపు లామునిరత్తిన్ !

---

# సాధన విధానాలు



శ్రీ వేలూరి సహజానందం

లక్ష్యాల ప్రాముఖ్యత క్రమేపీ తగ్గి, సాధన విధానాల ప్రాముఖ్యం హెచ్చుతున్న యుగం అంటే ఇదివరకు చెప్పాను. ఈ ప్రస్తావన చరిత్రలో కనుపించలేదని కాదు కాకపోతే ఇంత స్పష్టంగా, ప్రపంచమంతకు సంబంధించిన ప్రధాన సమస్యగా ఇదివరలో ప్రాముఖ్యత చెందలేదు

బహుశ మానవజీవితం యొక్క ఉత్కృష్టత, నికృష్టత-ఈ సమస్య, సాధన విధానాల సమస్య మీదే ఆధారపడి ఉండవచ్చు.

చరిత్రకు మనుష్యులు బద్ధులు అనే వాదాన్ని విశ్వాసాన్ని త్రోసిపుచ్చి, చరిత్ర మనుష్యులకి బద్ధురాలు అని నిరూపించవలసిన యుగసంధి ఇది. ఇదివరకు హింసకన్న వేరే సాధ్యవిధానం మనుష్యుని అందుబాటులో లేదన్నవారే ఈనాడు హింసతో విసిగి వేసారి, వేరే ఇంకే సాధనమైనా ఉందేమో అని తర్కిస్తున్నారు చర్చిస్తున్నారు ఇదివరకు వచ్చిన సంఘటనల నిప్పుడు భక్తి శ్రద్ధలతో పరిశీలిస్తున్నారు

పశువుకన్న మనుష్యుని ఉత్కృష్టత కేవలం విద్వత్తు, బలం వీటిలోనే కాదు స్థిరపడవలసింది. నిజానికి, తన ఆశయాలను నెరవేర్చుకోటంలో అవలంబించే మనుష్య విధానాలకు పశువిధానాలకు ఉన్న వ్యత్యాసమే, మానవ సంస్కృతి యొక్క విశిష్టతకు కొలబద్ద

ఆలోచనా శక్తిలో, సంఘటనా శక్తిలో, రక్షణ విషయంలో, మనుష్యుడు పశువును కొంత న్నాడు మదించిన పిశంగి సైతం తాకనిమాని, కంపిస్తుంది. కాని తన ఆశయాలను నెరవేర్చుకోటానికి అతను ఉపయోగించే విధానాలనుబట్టి ఆ తనమ్ము నాల తారతమ్యమేం. అంటే పశు విధానాలనే అవలంబిస్తున్నాడు.

అసాధారణ, వీరపురుషులను గజములతోనూ, సింహములతోనూ పోల్చే సంప్రదాయం ఇందుకు నిదర్శనం. పౌరుషం (అంటే తనను రక్షించుకొనే విషయంలోనే కాదు, ఇంకొకరికి బుద్ధిపూర్వకంగా హానికల్గించే విషయంలోకూడా) అనాది నుంచి కవితా వస్తువుగా ఉంటోంది. ఉపమానాలు వదన్నుగాలు కాబట్టి మిగతా రంగాల్లో ఎంత కొత్త పద్ధతులమీద మనుష్యుడు ప్రవర్తించినా, ఇంకొక మనిషితో పాటుకు వచ్చే విధానానికి బద్ధుడయే ప్రవర్తిస్తున్నాడు

పశువిధానంలోని ముఖ్యాంశం, రెండవ జీవి యొక్క ఉనికిని, వ్యక్తిత్వాన్ని ఏమాత్రం పరిగణించకపోవటం. ఈ తత్త్వం తల్లిదండ్రులకు పిల్లలకు సమస్య, భార్యాభర్తలకు సమస్య, దేశానికి ప్రేమకు సమస్య సింహాసనం వేసుకొని, శాసిస్తూనే ఉంది. ఎంతో సర్వత్రాణాగా పేరుపొందే సంసారికూడా కొంచెం లోతుకు తరచి చూసుకుంటే, తనింకా ధర్మానికి ఎంత దూరంలో ఉన్నాడో గ్రహించుకో గలుగుతాడు

వేలమందిని హతం చెయ్యటమే మనుష్యుని ఉత్కృష్టతకు గుర్తుగా పరిగణింపబడటం ఆచారమైంది. ముఖ్యంగా యుద్ధాలు జరుగుతున్న సమయంలో, శత్రువులెంత ఎక్కువమంది చంపబడుతుంటే, అంత సంతోషం మిన్నుముట్టుతుంది. ఇది ఆచారం అవటంతో, కొంచెం వ్యక్తిత్వం ఉన్న మనిషి అల్లా ఈ పంథానే, ఈ క్రూరమైన పంథానే తొక్కాడు.

నిజానికి ఒకప్పుడు అత్యంతం అసాధారణమైన విషయం అనుకున్న ఈ శక్తి, ఈ కాలం లేని శక్తి ఇప్పుడు చాలా సులభమైంది. దీనికి కారణం ఆయుధాల తయారీలో వచ్చిన మార్పులు. మరొకటి, చంపటం పౌరుషానికి లక్షణంగా గౌరవింపబడటం,

మొదటి కారణానికి మామూలుగా ఎక్కువ ప్రాధాన్యత చూపబడుతుంది. కాని నిజానికి, ఈ రెండవ కారణం అతి ముఖ్యమైనది మానవ జీవితానికి, పశు జీవితానికి ఉన్న ముఖ్య వ్యత్యాసమే ఇందుకు మూలం పశువు బాహ్య పరిస్థితులను, ప్రకృతిని తన అభీష్టానుసారంగా మార్చలేదు అంటే అది బాహ్యానికి బానిస మనుష్యుడు పూర్తిగా బానిసా కాదు పూర్తిగా స్వతంత్రుడూ కాదు. మనుష్యుడు తన ఆలోచనాశక్తితో మార్పు తెస్తాడు హింసపైనే అతని ఆలోచన మొగ్గి ఉండటంవల్లనే, ఆయుధాలను మరింత బలీయమైనవిగా తయారుచేయటం ఆత్మరక్షణకోసమే మనుష్యుడు ఆయుధాలను వినియోగించలేదు వినియోగించటంలేదు కాబట్టి హింసనుంచి ఆలోచనను మరల్చటం చాలా అవసరం—ప్రస్తుత సాధన విధానాల్లో మార్పు తేవడానికి

హింస ఇంత ఎక్కువగా మనుష్యునికి ఆరాధ్యదేవత కావటానికి కారణం, హింసకు అనుబంధమైన త్యాగం తన ప్రాణానికి వెరవనివాడు ఆదర్శ పురుషుడు వీరుడు స్వార్థరహితుడు ఇదీ మామూలుగా కనపడే దృష్టి. కాని ఇతరుల ప్రాణాలను తీయటానికి వెరవని వాడని, దుష్టుడని, పరార్థ వ్యతిరేకియని తట్టదు

ఇటువంటి సందర్భాల్లో ఒకమాట అంటారు. స్వ—సంరక్షణకు హింస వినా ఏమిటి మార్గం అని వేరేమార్గం ఏమిటి అనే ప్రశ్న అటుంచుదాం నిజానికి హింసను అంచనా వేస్తే, యుద్ధకాలాల్లో జరిగే హింస, శాంతి కాలంలో జరిగే హింసకన్న చాలా తక్కువ

ఒకపక్కన శాంతి అంటూ హింస ఎక్కువ అవటమేమిటి, అని వింతగా తోచవచ్చు కాని నిజం. అయితే హింస అంటే కేవలం ఆయుధప్రయోగం, ఇళ్లు తగలబెట్టటం, పంటలను నాశనం చేయ్యటమే కాదు ఇంకొక వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని అణచివేయటమే హింస. ఇది సాధ్యం కానప్పుడే మనుష్యుడుగాని, జాతులుగాని, దేశాలుగాని ఆయుధాల ప్రయోగానికి పూనుకుంటాయి. అందేత ప్రయోగించవలసిన అవసరం లేకుండానే తమ ఆశయం నెరవేరితే సరే. లేకపోతే ఎలాగో తప్పదు. కాబట్టి హింస ఆయుధాల సంఘర్షణలో అమాంతంగా పుట్టుకవచ్చింది కాదు అంతకు ముందే స్థిరనివాసం ఏర్పరచుకున్నది.

నిజానికి శాంతికాలంలో హిమాలయ శిఖరంలా పెరిగే ప్రచ్ఛన్న హింసే అగ్నిపర్వతంగా ప్రబద్ధమై, యుద్ధరూపాన్ని ధరిస్తుంది అంటే యుద్ధానికి బీజం శాంతికాలంలోనే ఉంది హింస శాంతికాలంలోనే ఒరలోకి దూరి ఉంటుంది యుద్ధాన్ని, హింసను మాన్పాలంటే, శాంతి కాలంలోని లోపాలను సవరించాలి అంటే మనుష్యుడు చూపవలసిన త్యాగం, పౌరుషం సరైరా శాంతికాలంలో చూపిస్తే, హింసకు తావు ఉండదు

శాంతిగా కనబడే వాతావరణం దటుక్కున హింసాపూరిత వాతావరణంగా ఎలా మారుతోంది? అంటే అంతవరకు ఒకరినొకరు—పెద్ద ప్రేమగా చూసుకోకపోయినా—హింసించుకోని వారు, తటాలున ఎలా ఒకరిపై ఒకరు కత్తులు దూసుకుంటున్నారు?

దీనికి కారణం శాంతి సమయంలో—శాంతి సమయం అనటంకన్న యుద్ధానికిముందు సమయం అనటం మంచిది—మనుష్యునికి మనుష్యునికి ఉండే సంబంధంలోంచే పుట్టుకొని వస్తోంది ఈ యుద్ధము, హింస ఈ సంబంధాల్లో ప్రచ్ఛన్నంగా ఉన్న హింస కొంతకాలానికి తీవ్రస్థాయిని పొంది, బహిరంగంగా తలెత్తక తప్పదు. ఒకప్పుడు, ఒకచోట పది సంవత్సరాలు, ఇరవై సంవత్సరాలు, ఇంకెక్కువ కాలం పట్టవచ్చు కాని పరిణామం మటుకు నిస్సంశయం—హింస

మనుష్యునికి మనుష్యునికి సంబంధం ముఖ్యంగా జీవనోపాధిసందర్భంలో వస్తుంది దీనికి పెద్దగా చారిత్రక పరిశీలన అవసరంలేదు మన్వెంత ఎవరితోనూ సంబంధం లేకుండా ఉండాలన్నా, సంబంధం ఉండక తప్పదు జీవనోపాధికి మూలమైన ప్రకృతి సంపదను సంఘటన పరిచే విధానంబట్టి ఈ సంబంధ బాంధవ్యాలు ఏర్పడుతవి.

మనుష్యుల సంఖ్య అత్యల్పంగా ఉండి, ప్రకృతి సంపద విశేషంగా ఉండిఉన్న రోజుల్లో బహుశ ఇప్పటి ఈ ఉచ్చులాంటి సంబంధం ఉండి ఉండకపోవచ్చు. ఏదైనా అది మనకు అప్రస్తుతం.

ప్రస్తుతం ఒకవ్యక్తి కేవలం తనతోపాటి మన యంతురించి వలపురితో సంబంధం పెట్టుకోవలసిన పరిస్థితి ఏర్పడింది ఈ సంబంధాల స్వభావంమీదే ఆధారపడి ఉంటుంది హింస అంటే ఈ సంబంధాల్లో అవలంబించే విధానాలు హింసావిధానాలైతే, పరిణామం హింస తప్పదు ఇంకొక వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని అణచివేయటం హింసలో మొదటి మెట్టు దీనికి గురైనవాడిని చూసి, ఆయుధాల కన్న హింసాత్మకమైన వేరో తన్ను చిత్రవధ చేస్తున్నట్టు వ్యథ చెందుతాడు ఆయుధాలే హింసకాదు అవి బహుశ హింసలో చివరి మెట్టు ఇతర ఆయుధాలు పనిచేయనప్పుడు, ఈ కత్తి, తుపాకి, విషవాయువు, ఉపయోగిస్తాడు

ఈ ఇతర ఆయుధాలేమిటి ?

హింసా చింత తలెత్తగానే లేక వేయలేమనో గానే ఒరలోంచి కత్తి దూయడు మనిషి మరణించటంలో లాభంలేదు, తృప్తిలేదు—తన ప్రాణానికి ఆ మనిషి ప్రమాదంగా ఉంటే తప్ప లేకపోతే ఆ మనిషి తనకు లోబడి జీవించి ఉండటమే తనకు లాభం, తనకు విజయం

ఆయుధాలను ప్రయోగించటం ఎందుకు ?

వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని, శారీరక వ్యక్తిత్వాన్ని నిర్మూలించటానికి ఇందుకు చివరి సాధనా విధానం ఆయునం ముందు ఉపయోగింపబడే ఆయుధాలు, మోసం, ద్వేషం, బెదిరింపు, అన్యాయం ఇవి పని చేయనప్పుడే, కత్తి, కటార్లు అవసరమయేది అంటే, అవతల వ్యక్తి జీవించిఉండగా తనకు లోబడడని నిశ్చయించుకున్నప్పుడే, ఆయుధాల జోలికి పోవటం కాబట్టి ఆయుధాలను సాధన విధానాలుగా విసర్జించాలంటే, అందుకు దారితీసే దృక్పథం, ఇంకొక వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని అణచి వేయాలనుకునే దృక్పథాన్ని విసర్జించాలి

ఇంకొక వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని అణచి వేయాలనే కోర్కె కేవలం వినాశనంగా, క్రూర విక్రీడగా అరంభంకాదు నీ జీవితానికి నువ్వేర్పరచుకున్న లక్ష్యంబట్టే, ఈ కోరిక తలెత్తుతుంది పరస్ప యున్నను క్రోడీకరించి, స్వార్థలాభమే లక్ష్యమైతే, అందుకు పరవ్యక్తుల నాశనంచేయటం, హింసించటం తప్పదు. నిర్భాగ్యుల అన్యాయం చేయటం, మోసగించటం, హింసించటం మనిషెలా కోరడో, సహించవలదనో, అలాగే ఇతరులూ నీపై చేసే అన్యాయాన్ని, మోసాన్ని, హింసను కోరడు కాని అంగబలం, బుద్ధిబలం, చిత్తశుద్ధిబట్టి, లొంగుతారు, లేదా ఎదురు తిరుగుతారు.

కాబట్టి హింసకు మూలం జీవితలక్ష్యం సాధన విధానాల నిర్ణయంకూడా జీవితలక్ష్యంయొక్క నిర్ణయంమీదే ఆధారపడిఉంటుంది పదిమందిని అన్యాయంచేసి, పైకి రావాలనుకున్న వ్యక్తి, ఇక్కడొక సత్రం, అక్కడొక అన్నదానం చేసినందువల్ల ధర్మాత్ముడు కాలేడు. గడి గోడలను, బుద్ధ చిత్రాలను వేలాడదీసినందువలన అహింసాత్ముడవవడు అతను హింసావిధానాలనే అవలంబించినవాడవుతాడు.

ఇంతవరకో హింస సకలంబిస్తున్నారని చూస్తూ ఉంటా ప్రతి ఒక్కరి అభియోగం సామాన్యంగా, ఎక్కడో అరుదుగా తప్ప, హింస చాలామటుకు ప్రతిహింస ఒకడు మొదటనే ఆయుధాన్ని ప్రయోగిస్తే, ఆ వంచితుడు శాస్త్రయుధాన్ని ప్రయోగించవచ్చు మొదటిది హింసకాదని, రెండవది అర్థనని అనటం యథార్థంకాదు రెండవది మొదటిదాని ఫలితం రెండు హింసను చెందినవే, హింసను హింసతో ప్రతిఘటించ కూడదనే సంగతి సరే కాని మోసం, పీడన, అన్యాయం, ఇవి హింస కాదనుకోటం భ్రమ కావటం అసత్యం

మోసం, అన్యాయం జరిపిన, జరుపబడిన వ్యక్తుల కుటుంబాలు శాశ్వతంగా, ఒకరి ఆస్తుల కొరకు నాశనం చేయటంలో కసి తీర్చుకోటం అలవాటైంది ఇప్పుడే వ్యక్తిప్రవృత్తి వర్గప్రవృత్తిగా పరిగణించింది.

అంటే వ్యక్తులతోపాటు, వర్గ ప్రవృత్తికూడా మారాలి వ్యక్తిప్రవృత్తి మారితే వర్గ ప్రవృత్తి మారుతుందనికదా అనవచ్చు. కాని వ్యక్తిప్రవృత్తి కన్న వర్గప్రవృత్తి మరింత దుర్గమమైనది. ఇతర మనుష్యులకన్న ఉత్కృష్టమైన ఒక ఉన్నత వర్గానికి తాను చెందినట్లు మనిషి గర్విస్తాడు. ఇతరులు [illegible] పై అంతస్తులో ఉన్నట్టు చూపా

# దిష్టి కళ్ళు



'వసశ్రీ'

'తెల్లారితే సంక్రాంతి పండగంట! అబ్బో! అబ్బో! అమ్మగారు ఏమేమి అప్పచ్చులొండుతారో మరి! చక్కిలాలు, గారెలు, బూర్లెలు, అరిసెలు. ఉష్! అదేంటో అటన్నిటిమీద కావుంటయ్ కెల్లగా బూరెలు. జిలేబీలయితే మరీ కావుంటయ్. అమ్మగారు తప్పకుండా వొండుద్ది. మద్దెన్నం గొడ్లకాడికి పోయేటప్పుడు ఏరయి చేతుల్లో రెండు — మూడు కాదు నాలుగు జిలేబీలు తీసుకొనిపోతచ్చు. గొడ్లను చెర్లో దోలి, వొడ్డున కూకోని వొక్కొక్కటే తిన్నాక చెర్లోని చల్లటినీళ్ళు తాగితే ఎంత బాగుంటుంది?

అలా రాత్రి రాముగాడికి నిద్దరే పట్టలా. ఎప్పుడెప్పుడు తెల్లవార్తుందా, ఎప్పుడు లేద్దామా అన్న ఆలోచనా, ఆ ఆలోచన తోటు జిలేబీలూ ఆ రాత్రంతా వాడికి చక్కిలిగింతలు పెట్టాయి.

పదకొండేళ్ళ రాముగాడు నిరుటి ఏరువాక పౌర్ణమినుంచీ రెండు ఎకరాల గింజలకు జీతానికి కుదురుకున్నాడు చౌదరయ్యగారింట్లో. రాముగాణ్ణి చౌదరయ్యగారి కాళ్ళదగ్గర, అన్నపూర్ణమ్మగారి చేతుల్లోను అప్పగించేసి, వాడి అయ్యా, అమ్మా మరు పిల్లల్తో బక్కచేం దరిద్రాన్ని లాక్కుని బతకటానికని.

పండగనాడు బలే హుషారుగా వున్నాడు రాముగాడు. తెల్లవారుఝామున నాలుగు గంటలకే లేచి, ఆ లంకంత యింటినీ, దొడ్డినీ వొక్క చిత్రున వూడ్చి ఎత్తిపోశాడు.

అన్నపూర్ణమ్మగారు దంచమన్న అద్దెడు సజ్జలూ వొక్క బిగువున కుమ్మేశాడు. అలా దంచుతూనన్నంతసేపూ వాడికి నూనెలో వుడుకుతూన్న సజ్జబూరెలు కళ్లలో కన్పించివుంటయ్! అంత పెద్ద రోకల్తో అద్దెడు సజ్జలూ అమాంతంగా అరగంటలో దంచికొట్టిన రాముగాణ్ణి చూస్తే దేనికీ ఆశ్చర్యం కలగని అన్నపూర్ణమ్మగారికే ఆశ్చర్యం వేసింది.

తను తినబోయే తియ్యటి సజ్జబూరెలను తలుచుకుని ఉప్పొంగిపోతూన్న వాడి మనసుకు అరిచేతుల్లో పొంగివుబ్బిన బొబ్బలు పట్టలేదు.

అంత హుషారుగా పనిచేస్తూన్న జీతగాణ్ణి చూసి—

"ఆహరి నీ దిమ్మబలా! రోజూ యింత హుషారుగా చెయ్యలేవేరా?" అంది మురిపెంగా అన్నపూర్ణమ్మగారు.

"ఏందమ్మగారూ! అట్టంటారూ ఇయ్యాల పండగాదంటమ్మగారూ!" అని అన్నప్పుడు



ఆ మెరకకళ్ళూ, కోటేరువేసినట్టుగా ముక్కూ, చిన్న నోరూ, సుందరవి పెదవులూ తీర్చి దిద్దినట్టుగా వుంటయ్ విశాలమైన ఆ కళ్ళూ, నిశితమైన చూపులూ ఎవరినైనా యిట్టే ఆకర్షిస్తాయ్ చక్కటి సుందరవి విశాలమైన వాడికళ్ళల్లో ఏవో కళుకులు కదుల్తావుంటయ్ కొత్తవాళ్ళొ ఎగాదిగా చూసుకుంటూ, చొక్కా చివురుకు దాచుకుంటూ, జారిపోతూన్న లాగును పైకి లాక్కుంటూ, కారుతూన్న ముక్కును పైకి పీల్చుకుంటూ రామిగాడు ఆరోజంతా ఎంతో వుత్సాహంగా వున్నాడు

అన్నపూర్ణమ్మగారు పొయ్యిమీద నేతిగిన్నె ఎక్కించి సజ్జబూరెలు వండుతూంది ఎదురుగా రామిగాడు చుట్టూ పిల్లల్ని చేర్చుకొని కబుర్లు చెప్తున్నాడు కాని వాడిమనసు తినబోయే తియ్యటి సజ్జబూరెలమీద, కళ్లు నూనెలో పొంగుతూన్న వాటి మీదనే వున్నయ్

మొదట వేసిన తునకలు రెండూ సరిగా రాక పోయేసరికి అన్నపూర్ణమ్మగారు చిరాబురుమంటూ తీతగాడిమీద విరుచుకుపడింది

“ఒరే! నీ దెబవంగానూ, ఎగురుగా కూర్చుని నీ పాడెం బిగించుకొన్నావురా? నీ మాపూ నీవూ మండిపోనూ అట్లా వాకిట్లోకి చూడరాదురా? అన్నట్టు యీ పూట గేదకు కుడితి పోశావురా?” ఎలాగైనా వాణ్ణి అక్కడ్నుంచి పంపాలనే ప్రయత్నంలో అంది

అన్నపూర్ణమ్మగారు దేన్ని వుద్దేశించి అంటుందో పూర్తిగా అర్థం కాకపోయినా రామిగాడికి అక్కడ్నుంచి వెళ్లాలనేది మాత్రం తెలిసింది గేదకు కుడితిపోయటానికి లేచివెళ్లాడు

తీతగాడు వెళ్లాక ఆమెగారు—“అరే! పీడ దిష్టి కళ్లు మండిపోను! ఆ చూపు పడితే యింకా తునకలు రాకపమే?” అనుకొని మెటికలు విరుచుకొంది పెద్దమ్మాయిని పిలిచి చీపురు తెప్పించి పొయ్యిచుట్టూ ముమ్మాటు తిప్పి దూరంగా పారేసి; తుపుకు తుపుమని పొయ్యిలో వుమిసి, పెటిక పెటిక మెటికలు విరిచింది ఈలోగా నూనె బాగా కాగడంచేత కాబోలు వండినవన్నీ సవ్యంగానే వచ్చాయి.

ఇంతలోనే, పచ్చిపిండి అతిగా మింగిన చిన్నోడు “అమ్మా కడుపులో నెప్పి” అంటూ వచ్చాడు

“ఇంకేం! వాడి పాపిష్టి కళ్లు ఆ పిండి మీద కూడా పడినై! చూశావుటే!” అంటూ కొడుకుని దగ్గరకు తీసుకుని, వాడి చుట్టూ చీపురు మూడుసార్లు తిప్పి, ఇంత వుప్పూ, మిరపకాయలూ పొయ్యిలో వేసింది

వాకిట్లో కూర్చుని వంటింట్లో వుడుకుతూన్న పిండివంటల వాసన్ని పీలుస్తూ ఆనందిస్తూన్న రామిగాడి దగ్గరకు పెద్దమ్మాయి చిట్టి, నోరు తెరవకుండా తింటూ, కుడిచేతిలోవున్న అప్పచ్చిని పరికిణీచాటున దాచుకొని వచ్చింది

చిట్టి పరికిణీలో దాచుకున్నదాన్ని పసిగట్టి ఎట్లాగైనా చిట్టిని బుట్టలో వేసుకోవాలనే ప్రయత్నంలో వున్నాడు రామిగాడు

చిట్టి వెనకాలే చిన్నోడు సజ్జబూరెను నోటికి కరుచుకొని వచ్చాడు అది చూసి చిట్టి చిన్నోణ్ణి మందలించింది రహస్యంగా చిన్నోడి చెవులో వూదింది—చొక్కాచాటున పెట్టుకోమని

“అమ్మాయిగోరూ! మీ చేతిలో వున్న కాయం కనక్కోమంటారా?” తినాలనే కోర్కె వాడి హృదయాన్ని వేధించింది “కాకమ్మ పెట్టుందో, పిచ్చికమ్మ పెట్టుందో?” అంటూ కళ్లు మూసుకుని చెయ్యి చాచేడు

“ఒరేయ్! నీకళ్ళు దిష్టికళ్లురా! నీవు చూడకుండా తినమని మా అమ్మ చెప్పింది” అమాయకంగా అనేసింది ఆకళ్ళచిట్టి

అది విన్న రామిగాడు తన కళ్ళనోసారి నలుపుకున్నాడు తన కళ్ళేమైనా మారిపోయినవేమోనని తడిమిచూసుకున్నాడు దిష్టికళ్ళంటే ఏమిటో చెప్పమని వాడి మనసుమ హృదయం వేధించింది అందుకే కాబోలు అమ్మగారు తనని అక్కడ్నుంచీ అంత విసరుగా వెళ్లిపొమ్మంది వండేటప్పుడు తను చూస్తే సజ్జబూరెలు చెడిపోతాయా? మాయమౌతాయా? అవి తినేప్పుడు తను చూస్తే తియ్యటిసజ్జబూరెలు చేదయిపోతాయా? ఆప్రశ్నలతో వాడి చిన్నిబుర్ర సతమతమయిపోయింది

అయితే పోయిన వుగాదిపండక్కు అమ్మ సజ్జబూరెలేకదూ వండింది వండుతూంటే తను దగ్గిరే కూర్చున్నాడుగా మరి అమ్మ ఎప్పుడూ చెప్పలేదేం తనవి దిష్టికళ్ళని ఎక్కడో వందలమైళ్ళ దూరంలోవున్న అమ్మ, అయ్యా, అక్కా, చిన్నతమ్ముడూ, చిట్టిచెల్లాయి వాడి కళ్ళల్లో కదిలారు ఆత్మీయులతాలూకు మధురస్మృతులు వాడి లేతహృదయాన్ని కదుపుకొన్నై.

చిన్నోడు మంచినీళ్లు తాగి వచ్చేసరికి మంచం మీద పెట్టివెళ్లిన అప్పచ్చి కాస్తా మాయమైంది. పాపం ఏడుస్తూ వెళ్లి అమ్మకు చెప్పుకొన్నాడు కను

గుకుంటూ వచ్చింది అన్నపూర్ణమ్మగారు. తలగాన్ని విలదీసి అడిగింది దొంగవెధవా! అట్లాంటి పనులు చేస్తే చేతులు విరగ్గొడతా నంది. ఆ మాటా అదీ అంతా దొంగమాటే నంది

“అమ్మగారూ! నే వసలు చూడలేదండి! దాన్ని నే తీయలేదండి అమ్మ తోడండి” అంటూ కాత్తిన చేయి పెట్టుకొని వొట్టుకున్నాడు అమాయకంగా పదకొండు సంవత్సరాల రామిగాడు

“ఛా! వెధవా! పైగా అబద్ధాలూ, వొట్లూను, ఎవ్వరూ తీయకపోతే సజ్జబూరెలు రెక్క లొచ్చి ఎగిరిపోయిందా ఏం!” రుసరుస లాడ్తూ అన్నపూర్ణమ్మగా రంటూవుంటే—అతురు పక్కన నల్లకుక్క కసకసా దన్నీ నములుతూంది! విస్మయాతితో నిండిన రామిగాడి కళ్లల్లో గిర్రున నీళ్లుతిరిగాయి

* * *

“ఒరేయ్! రామిగా యిక్కడున్నట్టుగా రావాలి రాగానే నీకు అప్పచ్చులు పెట్తాను పాపం! పొద్దుట్నుంచీ కని పెట్టుకొని వున్నావ్” సజ్జబూరెల మూటను రామిగాడి చేతి కిస్తూ అంది అన్నపూర్ణమ్మగారు ఉత్తరప్పాలాని మామిడితోపు దగ్గరవున్న వంగమున్సబుకు నీరు కట్టిస్తూన్న చౌదరయ్యకు సర్వపత్తి అన్నపూర్ణమ్మ తలిగాడిచేతికిచ్చి పిండివంటకాలు మూటకట్టి పంపించింది

దొరసానమ్మగారు సజ్జమూరెలు పెట్తుందని కొండంత ఆశతో ఎదురుచూస్తున్న రామిగాడికి మళ్లీ పని తగిలింది అ పెట్టేదేదో యిచ్చాకే పెడ్తే, తింటూ ఎంతో చక్కగా పొలం పోయేవాడ్నిగదా అనుకున్నాడు అయినా, రాగానే పెట్తానందిగదూ! అయితే తొందరగా వెళ్లిరావాలి ఎంత తొందర్లో తిరిగొస్తే అంత తొందర్లో బూరెలు తినొచ్చు! పొలం పోయి వచ్చినందుకు యింకా రెండెక్కువే అమ్మగారు యివ్వొచ్చు! యిచ్చాకే అడిగితే తక్కువే యివ్వొచ్చు! అలా ఆలోచనలో పడి పరుగెత్తుతున్న మనసుతో వాడి కాళ్లు పందెం వేసాయి అన్నపూర్ణమ్మగా రిచ్చిన మూట భుజాన వేసుకొని పరుగు లంకించుకొన్నాడు వీధి దాటి మళ్లుపు తిరిగి రోడ్డెక్కాడు. పెద్దకాలువగట్టు దాటి, కట్ట ఎక్కగానే వాడి పెదవులో వొక నవ్వు మెరుపులా మెరిసింది మూట దించి మెల్లగా విప్పాడు అసలే పెద్దవైన వాడికళ్ళు మరీ పెద్దవైనయ్. హృదయం ఆనందంతో నిండిపోయింది. నోరు వూరుతూంది! పెదాలు తడుపుకొన్నాడు బాగా వుబ్బి పొంగివున్నయ్ బూరెలు—ఒకటి—రెండు.. మొత్తం వొకటి తక్కువగా పది!

అందులో వొకటి తింటే అయ్యవగారు కసుక్కో వచ్చాగాదేం! ఇంటికొచ్చాక అమ్మగారు శీన గాడు ఎన్ని తీసుకొచ్చాడని అడిగితేనో? అమ్మో! యింకేమన్నా వుందీ?

ఆ ఆలోచనతో రామిగాడిగుండెలు దడదడ లాడిపోయినై. రెండుచేతులనిండా పళ్ల బూరెలు తీసుకొని పెదాలకాదించుకొన్నాడు వాడికి తెలి యకుండానే వాడి నాలిక వాటిని తడిపిచూసింది అమ్మో! ఎంగిలి చేస్తే పాపంకాదూ! కళ్ళు పోవూ? ఆ భావన రాగానే అస్తమిస్తూన్న సూర్య భగవానుని చూసి చెంపలు వేసుకొన్నాడు మళ్ళీ భద్రంగా మూటకట్టి బుజానవేసుకొని చౌదరయ్య గారి తంగతోట వేపు దారితీశాడు చౌదరయ్యగారికి బూరెల మూటయిచ్చి యింటిముఖం పట్టాడు రామి గాడు

పొద్దుపోతే వెళ్ళితే ఆలస్యం అవుతుందని, అడ్డ దారినవున్న కాలువగట్టనే వెళ్ళాలని చేలను అడ్డంపడి దబదబా నడుస్తూన్నాడు. గొర్రెలు విడిచిన గతుకు లూ, గండ్లుకొట్టినగట్లూ చెంగు చెంగున దాటిపోతూ న్నాడు. తినబోయే పళ్లబూరెలు తోలూ తూ వాడి ఆశలు పెలరేగుతున్నాయి సంధ్యచీకట్లు తెరలు తెరలుగా అలుముకుంటూన్నాయి కొట్టివేసిన కర్ర కడియములూ, కోసివేసిన జనపగుంపులూ, విరగ కాచిన మామిడితోటా, ఏపుగా పెరిగిన చెరుకుతోటా, పళ్లబూరెలుతింటూ తాలీలను అదమాయించుకున్న చౌదరయ్య ఆ చీకట్లో మసక మసగ్గా మాయమయి పోతూన్నారు

దూరంగా చీకట్లో మునిగిపోతూన్న పూరూ, చౌదరయ్యగారింటికేసి దీక్షగా చూస్తూ నడవసాగు తున్నాడు, పదకొండేళ్ల రామిగాడి చిట్టిబుర్రలో తినబోయే తియ్యటి పళ్లబూరెలు కాలుకూ మనుర స్మృతులు వువ్వెత్తుగా లేచి పడ్తున్నాయి ఆనం దంలో పరవశత్వం చెందుతూన్న వాడి హృదయా నికి కాళ్ళకు గుచ్చుకుంటూన్న జనపదుబ్బులూ, చిల్లిగవ్వలూ బాధకలిగించడం లేదు

మెల్లగా దిగి పంట కాలువదాటి మళ్లీకట్ట ఎక్కి రామిగాడు టక్కున ఆగిపోయాడు వాడిగుం డెల్లో ఏదో పట్టుకున్నట్టయింది. ఎదురుగా చీకట్లో వుంచున్న రెండు తాటిచెట్లూ, వాటి మధ్యగా పెరిగిన నిలువెత్తు పుట్టా వాడి కళ్లల్లో కదిలి వాడి లేతమనసును కలవరపెట్టింది కళ్లు తోసారి గట్టిగా నులుముకొన్నాడు పళ్లబూరెలతో నిండిన అన్నపూర్ణమ్మగారి చేతులు వాడ్ని ఆప్యాయంగా ఆహ్వానించినై. అంతే, మళ్లీ పరుగు లంకించుకొ న్నాడు రామిగాడు—

రెండు పొడుగు తాటిచెట్లమధ్య పుట్టమీద పడగ విప్పి నాట్యంచేస్తున్న నాగుపాము వాడి దిష్టికళ్లకు కన్పించలేదు! నాలుకలు చాచుకున్న నాగేంద్రుడు వాడి పాపిష్టికళ్లకు కన్పించలేదు! కోరలు చాచిన త్రాచుపాము వాడి దొంగచూపులకు కన్పించలేదు! విషం కక్కుతున్న కాలసర్పం వాడి దిష్టికళ్లకు కని పించలేదు! చేతులు చాచిన పాపిష్టి మృత్యువు వాడి దిష్టికళ్ళకు కన్పించలేదు!

పదకొండు సంవత్సరాల శీనగాడి భౌతిక దేహం, కటికచీకట్లో ఆ నిలువెత్తు పుట్టపక్కన వాలి పోయింది

తీర్చిదిద్దిన రామిగాడి విశాల నేత్రాలకు మరి ప్రపంచం కన్పించలేదు

ఎక్కడో కొన్ని వందలమైళ్లదూరంలో ఏదో పట్టణంలో వుగాదిపండగనాడు కూలిలేక కూడులేక కుమిలిపోతూ పడ్తూన్న వో రిక్షావాడి గుండెలు కలుక్కుమన్నాయి

సంవత్సరాదిపండగనాడు అన్నపూర్ణమ్మగారి వంటింట్లో పుట్టిమీద వున్న బుట్టలో రెండు పళ్ల బూరెలు మిగిలిపోయినై

---

# కలగూరగంప

## వర్ణచిత్రరచన - ప్రాచీన సంప్రదాయములు

రసాస్వాదనకు ఉపకరించే విజ్ఞానమే సంస్కృతి వికాసమునకు తోడ్పడుతుంది. ఒక జాతి సృష్టించుకొన్న కళా సంప్రదాయములలోనే ఆ జాతి యొక్క సంస్కృతి సంపద వ్యక్తమగును. లలిత కళలలో వర్ణచిత్రణమున కొక ప్రత్యేక ఆకర్షణగలదు. ఆకృతులకు అనుగుణమైన రంగుల చిత్రణమువలనే సహజమైన ఆకర్షణగలిగి ప్రజారంజకములగుచున్నవి. కుడ్యములు, వస్త్రములు, దారు విగ్రహములు, గృహోపకరణములు మున్నగునవెన్నో వర్ణచిత్రణమునకు స్థానములు. కాగితములు, గృహపరిశ్రమగా తయారుచేయబడి, ఉపయోగములోనికి వచ్చిన నాటినుండియు అవి చిత్రకళలు వ్రాయుట కుపయోగపడుచున్నవి. చారిత్రకముగా మన దేశములో కళలకు మత ద్వయాలవల్ల కలిగినంత ప్రోత్సాహము అన్యమార్గముల లభింపలేదు. పురాణ, బౌద్ధయుగములలో ఈ వర్ణచిత్రకళ అత్యున్నత స్థితిలోనుండెనని నిరూపించుటకు అజంతా, ఎల్లోరా, భువనేశ్వరము, తిరువానూరు, తంజాపురములందలి కుడ్యచిత్రములే ప్రబల నిదర్శనములు. మగధేశ్వరులను జయించి స్వతంత్రరాజ్య స్థాపకులైన ఆంధ్రరాజన్య చూడామణుల ఆదర ప్రోత్సాహములతో ఉల్లి విరిసిన ఆంధ్రుల హస్తకౌశలమే అజంతా కళాలయములాగా రూపొందినది. అక్బరు పాదుషా కాలములో హైందవ పారశీక సంప్రదాయముల సమ్మేళనముతో చిత్రరచన యందొక నూతన కళ ముదయించినది. మనదేశమున ఆంగ్లేయుల ప్రాభవము వచ్చిననాటినుండియు హైందవకళలకు ప్రోత్సాహము తగ్గినది. దేశీయ సాంప్రదాయములు ఇటీవలి రెండు శతాబ్దులలో విచ్ఛిన్నమైనంతగా చెప్పదగినదిగాలేదు. అయినప్పటికి హిందూమత వాహినిలలోనే, అన్య సంస్కృతుల తాకుడులెన్ని తగిలినను వాటిని తనలో లీనము గావించుకొని నిజతత్త్వమునకు భంగము వాటిల్లకుండ నేటికిని హైందవకళా సంప్రదాయములు ప్రజానీకములో స్వీయప్రభావమును గోల్పోవక నిలిచియుండుటయే వాటి ఘనతకు నిదర్శనము.

కళానుభూతి — ఇంద్రియానుభూతిద్వారా అతీంద్రియ విషయములను గ్రహించుట కళయొక్క పరమావధి. రూపముద్వారా దాని కతీతమగు విషయాన్ని వ్యక్తపరచుట చిత్రరచనయొక్క లక్ష్యము. సంగీతము విని ఆనందించుటకు రాగజ్ఞానము తాళజ్ఞానము ఉపకరించినట్లే చిత్రకళను ఆనందించుటకు వర్ణ పరిజ్ఞానము రేఖా పరిజ్ఞానము సాయపడును. ఏదైన చిత్రాన్ని చూచినప్పుడు చిత్రరచనకు కారణభూతమైన వస్తువు, వర్ణవిన్యాసము, రేఖారచన ముఖ్యముగా గమనింపదగినవి. నేత్ర గాత్రముల సమ్మేళనమువలన శ్రవణేంద్రియముద్వారా కలిగే ఆనందమువలెనే రూపము, వర్ణము, రేఖల, కలయికవల్ల చక్షురింద్రియముద్వారా చిత్రకారుడు దర్శకుని ఆనందపరచుచున్నాడు. ఇది సార్వజనీనమైన విషయము. ఒకానొక సంగీత విద్వాంసుడు నాదానుసంధానము చేసి శ్రోతలను తన్మయులను గావించగలిగినట్లే ప్రజ్ఞావంతుడైన చిత్రకారుడు కేవలము వర్ణ సంవిధానమువలనగాని రేఖారచనవలనగాని ద్రష్ట సమ్మోహితుని గావింపగలడు. ఇట్టి ఫలసిద్ధికి ద్రష్టకు, చిత్రకారులకు, కూడ తగినశిక్షణము అనుభవమున్నగాని కుదురదు. హైందవకళలలో ఆధ్యాత్మికానుభూతి జీవమువంటిదని చెప్పదగును. దేశమునవ్యక్తి భేదముల ననుసరించి, జాతిభేదముల ననుసరించి, ఆయారూపముల యొక్క అంగిక భంగిమలలోను హస్తవిన్యాసములలోను శాస్త్ర సమ్మతమగు సాంకేతిక రహస్యములుండును. వాటి పరిజ్ఞానము లేనిదే అందలి సొగసు అర్థముగాదు. ప్రబంధములందు ఆయా పాత్రల సౌందర్యాతిశయమును వర్ణించుటలో కవులిచ్చిన ఉపమానములందలి భావములను ముందుగా నవగాహన మొనర్చుకొనవలసియున్నది. ముఖమును చంద్రబింబము, కన్నులను కలువరేకులు, గళమును శంఖము, చెక్కులను అద్దములు, ఇత్యాదిగా చెప్పిన ఉపమానములు ఆయా అంగముల సౌందర్యగరిమకు సూచకమాత్రములే. లక్ష్మి, సరస్వతి,

దుర్గ మున్నగు దేవతల యొక్కయూ, రాము, కృష్ణ, బుద్ధా ద్యవతారముల యొక్కయూ రూపవిలాసము లను వర్ణించుటలో ఆధ్యాత్మిక విజ్ఞానవేత్తలైన ఋషుల భావావేశమునకు ఎల్లలు గోచరించవు అవా జ్మానస గోచరము, వర్ణనాతీతమునగు భగవత్స్వ రూప నిరూపణలో వారు కోటి సూర్యప్రభలు, విద్యు ల్లతికలు, తారాకాంతులు మున్నగు యుపమానము లతో అ చిద్భూ!! రూపులు కట్ట ప్రయత్నించిరి అట్టి అలౌకిక స్వరూప నిరూపణలో చిత్రకారుని తూలిక వాస్తవిక శాస్త్ర సూత్రములకు కట్టుబడినంత మాత్రమున జాలదు. అట్టి యుదాత్త భావస్ఫురణ కనుకూలించు వర్ణ సంవిధానము, తూలికా విన్యా సములున్న గాని చిత్రము రంజకము గాజాలదు ఇట్టి చిత్రరచనకు చిత్రకారునిలో తగినంత సంస్కృతి, అనుభవము అత్యంత వాంఛనీయములు లేనివాడు !! !! తలిశెట్టి రామారావుగారు ముఖమునకు చం ద్రుడు, నాసికకు నువ్వు పువ్వు, కన్నులకు రెండు చేపలు, చేతులకు రెండు కలువకాడలు, కంఠమునకు శంఖము, చెవులకు ( ) కారములు మున్నగు వాటిని కూర్చి వ్యంగ్యముగా చిత్రించిన ప్రబంధకన్యక తయారగును అందుచేతనే భారతీయ కళలో వాస్తవిక దృక్పథముకన్న ఆదర్శ స్ఫురణకు ప్రాధాన్యత గలదు

వర్ణ సంవిధానము అజంతా మున్నగుచోట్ల అప్రతిమానమగు కళాసృష్టి గావించిన చిత్రకారు లెవరో వారి జీవితము లెట్టివో తెలియకుండ కాల గర్భమున విలీనమైపోయినవి వారికి కళారాధనపట్ల గల ఏకాగ్రతలో స్వీయచరిత్రలను వ్రాయించుకొను తలంపులేదు చిత్రకారుల చరిత్రలతోపాటు ఆనాటి వర్ణలేప విధానములుగూడ తెలియరాకున్నవి ఉప లభ్యమైనంతవరకు అజంతా గుహల గోడలకు మట్టి, గోమయము, యిసుక, ఊక మున్నగు ద్రవ్యములను గలిపి దళముగా పూతపెట్టి సుహోదుస్సుల ఉపరి తల మును చదును పరచెడి వారని, దానిపైన సున్నము, శుద్ధ పాదుములతో మరి పూతపెట్టి వర్ణచిత్రణమున కనువుగా ఫలకములను సిద్ధపరచెడి వారని తెలియ చున్నది కొన్ని ప్రకృతిసంబంధమైన శిలాధాతువుల నుండి రంగులను సమకూర్చుకొనెడి వారు. హరిదళము నుండి పసుపురంగు, లోహ మిశ్రణములనుండి ఎరుపు, గోధుమవన్నెలను, హరిత వర్ణపు శిలలనుండి ఆకుపచ్చని రంగును, నీలపు రాళ్లనుండి నీలవర్ణ మును, తయారుచేసెడి వారట ఆంధ్రదేశమున వర్గ

చిత్రణము, దారుశిల్పము, ముఖ్యవృత్తిగాగల కళాకారులలో కొండపల్లి చిత్రకారులు ముఖ్యులు. వీరు చిరకాలమునుండి హిందూ సంస్థానములలోను, మహమ్మదీయ సంస్థానములలోను ఆస్థాన చిత్రకారులుగ నుండి వారిచ్చిన మడిమాన్యముల ననుభవించుచు చిత్రరచనలు చేయుచుండెడివారు. దేవాలయములలో వాహనములు నిర్మించుట, రంగులతో పురాణ కథలను వ్రాయుట, అలంకరణములు చేయుట వారి ముఖ్య విధులు. ఇంతేగాక కొండపల్లి బొమ్మలని ప్రసిద్ధికెక్కిన చిన్న కొయ్యబొమ్మలలో జానపద జీవితమును ప్రతిబింబించు శిల్పము లతిసున్నితముగా తయారు చేయుదురు. అవి అనేక జాతీయ అంతర్జాతీయ ప్రదర్శనములలో ప్రఖ్యాతి పొందినవి.

రూపచిత్రములు, తస్వీరులు

రూపచిత్రములు, తస్వీరులు వ్రాయుటలోను దశావతారి పేకలను తయారు చేయుటలోను వీరికి ప్రత్యేక ప్రవీణతగలదు. ఇది రాజపుత్ర 'మినియేచర్సు,' కు ఎందును తీసిపోవు. వీరిలో కొందరు 16వ శతాబ్దముననే విజయనగరము చేరిన నాయక ప్రతినిధులతో కలసిపోయి తంజావూరు ప్రాంతములలో స్థిరనివాసము లేర్పరుచుకొన్నట్లు తంజావూరు మాన్యుల్సునందు గలదు. లేపాక్షి వీరభద్రేశ్వరాలయ కుడ్య చిత్రములలోను కుంభకోణము రామస్వామి ఆలయముఖద్వారము గల చిత్రములందును వీరి కళా వైపుణ్యము గాంచనగును. పిఠాపురము, పెద్దాపురము, సంస్థానీకుల పోషణలో నుండిన చిత్రకారుల రచనలు నేటికిని అద్భుతముగ కాంతిచిమ్ముచున్నవి. మూర్తికల్పనయందు గల ప్రావీణ్యమెంత గొప్పదో వర్ణ సంవిధానమందును రేఖారచనయందును వీరికి గల లాఘవమంత విశిష్టమైనది. వీరి చిత్రములలో రేఖలకు జీవముట్టిపడుచుండును. వీరి సంప్రదాయములలోని వర్ణ సంవిధానముల సొగసు, రేఖా రచనయందలి వారి ప్రావీణ్యము రూపమునందలి సౌందర్యము ఇందు గాంచవగును. ఇటీవల ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఆర్ట్ ఇన్ యిండస్ట్రీస్ (*Indian Insti tutute Arts In Industries*) తరఫున పర్యటించిన వారును, ప్రసిద్ధకళా విమర్శకులునగు సుధాంశు కుమార రాయిగారు కొండపల్లి కళా సంప్రదాయముల గురించి వ్రాయుచు వారి వర్ణ సంవిధాన పద్ధతి పరాశ్రయ మెరుగదని స్వతంత్రమైనదని నుడివియున్నారు. ఇంగిలీకము, సీసురాయి, నీలిమందు, జంగాలి పచ్చ, అరదళము, శుద్ధముష్కనగు ఖనిజపదార్థములనుండి రంగులను స్వయముగా చేసుకొందురు. మేక, ఉడుత వెంట్రుకలతో కుంచెలను స్వయముగా కట్టుకొందురు. రంగులు వేయుటకు ముందుగా సుద్దనుగాని గోడలకుగాని బొమ్మలకుగాని సుద్దతో పూత పూయుదురు. అసైన సఫేద (*Zincoxide*) తో మలిపూతపూసిన మంచి ధావళ్య మేర్పడును. ఈ సఫేద్‌లో కొద్దిగా నీలిమందు కలిపి నీలపు రంగును, అంతకన్న తక్కువగా నీలిమందు కలిపి ఆకాశపురంగు తయారుచేయుదురు. ఇట్లే ఒక భాగము ఇంగిలీకమునకు 3 భాగములు సీసుగుద్ద కలిపి నారింజ మంచి ఎఱ్ఱరంగు తయారగును. ఇందులో శ్వేత వర్ణములకు సుద్దకు బదులు సఫేద్ కలిపిన రంగు మాసిపోవదు. రేఖా రచనమున ఉపయోగపడు నల్లరంగు ఆముదపు, కిరసనాయిలు దీపములనుండి వచ్చిన మసితో తుమ్మజిగురునీళ్లు కలిపి తయారు చేయుదురు. ప్రతిమలకు, తస్వీరులకు అలంకరణకై ఉపయోగించు బంగారు వర్ణము కుందనపురేకుతో చేయుదురు. ఈ కుందనపురేకు వీరిలో కొందరు స్వయముగా గృహ పరిశ్రమగా తయారుచేసి కొందరు. ఈ కుందనపురేకుతో ఘటములకు బొమ్మలకు అలంకరణములు చిత్రించుటలో వీరికి ప్రత్యేక ప్రావీణ్యముగలదు. వీరి చిత్రములలో రంగులు, కుందనపుఛాయ, కాంతి తప్పక ఎంత కాలమైనను క్రొత్తవిగానుండును. ఇట్టి ప్రక్రియ లెన్నో మూలబడినవి.

కాలక్రమమున కవిత్వము, సంగీతము, మున్నగు ఇతర కళలలో వలెనే చిత్రరచనలోగూడ జాతీయత నశించి అన్యదేశీయ సంప్రదాయముల అంధానుకరణము మాత్రము చూచుచున్నాము. ఉత్తమ చిత్రములు చూచి ఆనందించుటకు తగిన సంస్కృతిగూడ పూర్తిగా మృగ్యమగుచున్నది. జాతీయ సంప్రదాయములను భద్రపరచుకొనుటకు నేటి సినిమా యుగమందలి కృత్రిమ ఆకర్షణలపై కొంత మోజు తగ్గించి యథార్థ కళారాధనకు పూనుకొందురుగాక.

శ్రీ కాముఖుపి. సత్యనారాయణవర్మ.

---

# నైజాములో కొన్ని ఆంధ్ర సామంతరాజ్యములు

ప్రస్తుత నైజాము రాజ్యములో అర్ధభాగము పైగా ఆంధ్రదేశములోని దగుట, చిరకాలము నుండియు ఆంధ్రదేశచరిత్ర యభిన్నముగనే యున్నది. నైజాములో నువ్వవిల్లిన రాజ్యములు సర్దారులు, దత్తమండలములలోనివి, ఆంధ్రమున వెలసిన రాజ్యములు నైజాములోనికి వ్యాపించి ప్రసిద్ధిగన్నవి. మధ్యయుగము (క్రీ. శ 1500—1800) లో వెంగి

చేసిరి మన్మ గణపతి బహుశః రెండవ పోతరాజా మనుమడైయుండెను. ఇతని శాసనములు వేదాద్రి (1249 క్రీ శ) 4 అను మంచి పల్లెలలో గలవు అను మంచిపల్లి (1260) 5 శాసనములో రాజా మనుమచాగి గణపతి అని పేర్కొనబడియున్నాడు ఇతని మరొక శాసనము తిరుమధిర సమీపమున చెందులూరులో అంజనేయస్వామి ఆలయములో యుంచబడిన త్రవ్వితీయబడిన 4½ అడుగుల ఎత్తుగల ముఖమంటప శిలపైగలదు ఇది కాకాలను కేశవదేవరకు శ్రీ మన్మహా మంచిశేశ్వర మన్మచాగి గణపయ రాజుల దానమును చెప్పుచున్నది కాకాలని కేశవాలయ మిచటిదో? చెందులూరులోనిదైన, నా కాలమున చెందులూరునకు కాకాలను అను నామాంతరముండి యుండవలెను

చెందులూరులో దొరికిన విగ్రహములు సీతా రామ లక్ష్మణులు, గరుడాళ్వారు, పన్నిద్దరు ఆళ్వారులు, యిద్దరు ద్వారపాలకులని

చాగిరాజులు వైష్ణవోపాసకులు నరసింహ వర్ధన బిరుదాంకితులు కాన యీ విగ్రహములన్నియూ, వారి కాలమునాటి యొక యాలయము—బహుశ కేశవాలయము—లోనివై యుండును ఇచటనే పూర్వము రెండు శివలింగములు, పానవట్టములు, వినాయక, దేవి విగ్రహములు దొరికినవి రెడ్డి రాజుల పాలన నైజాము ఈ ప్రాంతములవరకు వ్యాపించనందున, యీ విగ్రహములన్నియూ కడపటి రెడ్డినాటి వనుట సమంజసము కాదు. అందువలన యీ విగ్రహములందు కాకతీయ శిల్పఛాయ లుండుట కాని తర్వాతి కాలపు విజయనగరశిల్ప విశిష్టత యుండుట అసంభవముగదా!

పరిచ్ఛేది రాజులు నట్నహాద్ర, కొల్లిపాక 700 రాష్ట్రములను, కొల్లిపాక, విజయవాడ రాజధానులుగ పాలించిరి 13 వ శ॥ అంతమున పరిచ్ఛేది రాజ్యము కాకతీయ ప్రతాపరుద్రుని రాజ్యములో గలిసి పోయెను 7

నతవాటి రాజులు (క్రీ శ 1104—1249) ముండపల్లి రాజధానిగ నతవాటి విషయమును పాలించిరి మునపల్లి మధిరకు సమీపమున గలదు నతవాటి రాజులు ప్రారంభమున కళ్యాణి చాళుక్యులకు, తర్వాత కాకతీయులకు సామంతులైయుండిరి

యాదవరాజులు కాకతీయుల సామంతులై పానుగల్లు రాజధానిగ పాలించిరి వీరు విష్ణు వంశోద్భవ, యాదవకుల తిలక, ద్వారవతీపురవరాధీశ్వర బిరుదముల దాల్చిరి శార్ఙపాణి దేవుడు దేవగిరి యాదవ చక్రవర్తి సింగనదేవుని (క్రీ శ 1210—1247) పుత్రుడు బహుశః కైతుగి యొక్క కనిష్ఠ సోదరుడై, దేవగిరి వీడి, కాకతీయ సామంతుడై యుండును ఇతని ప్రశస్తి సమస్త భువనాశ్రయ పృథ్వీవల్లభ మహారాజాధిరాజపరమేశ్వర పరమ భట్టారక—తో ప్రారంభమగును శార్ఙపాణి సోదరుడు దేవి రాజ ప్రతినిధిగ నుండెను ఇతడు శాసనములో తిరిగి చేసిన విజయములన్నియూ తండ్రి సింగనదేవుని వే గాన తండ్రి విజయములలో నితడు పాల్గొనియుండి, తనవిగా చెప్పకొని యుండును

శార్ఙదేవుని రాజధానియైన పానుగల్లులోని ఛాయా సోమేశ్వరాలయము కొన్ని శిల్పవిచిత్రముల జూపుచున్నది సంగీత రత్నాకర గ్రంథకర్త శార్ఙదేవుడు, పానగల్లు సారంగుని సమకాలికుడై యాదవ సింగనదేవుని యాస్థానమందుండెను 9 150 సం॥ లకు పూర్వము చెందులూరు సారంగ పట్టణమని జనులనుడి అచట ప్రసిద్ధశైవ, వైష్ణవాలయము లుండెడివట 10 ఈ సారంగపట్టణమును పానగల్లు యాదవరాజా శార్ఙపాణి పేరుమీద కట్టియుండెను. అతని పేరనా పట్నము నిర్మింపబడి యుండును

శ్రీ వారణాసి యశోదాదేవి

---

4 *309 of 1924*

5 *Bharati March 1952*

6 *Bharati March 1952*

7 *V. Yasodadevi The history of Andhra country*

8 *Telingana inscription I Kakatiya-his no 33 Hyd Arch Seris no 13 II no 34*

9. *Sarangadeva Sangita Ratnakara (1943) I Text p 10,*

10. *Bharati March (1952)*

# గ్రంథవిమర్శనము

## రానున్న సంక్షోభం

శ్రీ ట్యూస్టరన్ బర్గ్, అనువాదం విద్వాన్ విశ్వం ప్రచురణ: ఇంటింటి విజ్ఞానమాల, 16 కొమ్మ వీధి, మదరాసు వెల ఆరురూపాయలు

ఇది ప్రపంచార్థిక మాంద్య స్వరూపాలు, కారణాలు నివారణోపాయాలు, మొదలైనవాటిని గురించి సూలంకషంగా, సువిశదంగాను చర్చించే గ్రంథము.

ప్రపంచార్థికమాంద్యాలకు కమ్యూనిస్టులు కొన్ని ప్రధాన కారణాలు, నివారణోపాయాలు నిర్వచిస్తారు వీటినిగురించి మార్క్సిష్టులు చేసినంత సూక్ష్మపరిశోధన ఏ అర్థశాస్త్రవేత్తలు చెయ్యలేదు మొట్టమొదట మార్క్సు వీటినిగురించి సమగ్ర పరిశీలన చేసినతరవాత చాలామంది ప్రపంచార్థికవేత్త లీతనిపంథా అవలంబించి ప్రపంచ సంక్షోభాలు కలిగించే ఈ ఆర్థిక సమస్యలనుగురించి తీవ్ర పరిశోధనలు సాగించారు

శ్రీ స్టెరన్ బర్గ్ ప్రపంచ విఖ్యాతి సాధించిన రాజకీయార్థికవేత్త ఇతడీ గ్రంథంలో 1929 లో సంభవించిన ఆర్థికమాంద్యాన్ని గురించీ, తదనంతరంగా ప్రపంచంలో ఏర్పడిన రాజకీయార్థిక సంక్షోభాలనుగురించీ, సోదాహరణంగా వివరించాడు

అంతేగాక ప్రస్తుతంరానున్న ఆర్థిక సంక్షోభం సరిగా పాతమార్గాన్నే కాక కొన్ని క్రొత్త దారులు తొక్కగలదని కూడా సూచించాడు దీనికోసం ఇతడు పేర్కొన్న సంఘటనలు, సూచించిన ప్రమాణాలు సామాన్యపాఠకులకు కూడా సులభంగా అవగాహన అవుతాయి

అయితే శ్రీ స్టెరన్ బర్గ్ కేవలం కమ్యూనిష్టు పంథా ఒక్కటే ఇక ప్రపంచానికి శరణ్యమనే ధోరణి అవలంబించడు అయితే ప్రపంచార్థిక సమస్యల అవగాహనలో మాత్రం చాలావరకు ఇతడు మార్క్సుమార్గమే అవలంబిస్తాడు

కాని ఈ సమస్యానివారణంకోసం ఇతడు సూచించే నివారణోపాయాలు చాలావరకు సోషలిష్టు పంథాలో నడుస్తాయి ఇలాంటి ఆర్థిక సమస్య ఉదయించినప్పుడు ప్రభుత్వమే బాగా కలగజేసుకుని, ఉత్పత్తి, పంపకము మొదలైన విషయాలలో సమాజంలో సభ్యులకు న్యాయం జరిగేటట్టు చూడాలని సూచిస్తాడు ప్రజాస్వామ్యపద్ధతి సామ్యపద్ధతులద్వారానే ఇది జరగాలని ఇతడీ గ్రంథంలో ప్రతిపాదిస్తాడు.

మనదేశంలో అప్పుడే కొంచెం కొంచెం ఆర్థికమాంద్యసూచనలు కనిపిస్తున్నాయి ఈరోజుల్లో ఈ ఆర్థికమాంద్యానికి సంబంధించిన సమస్యలన్నీ అర్థం చేసుకోదలచినవారికి ఇది అవశ్యపఠనీయమైన గ్రంథము

శ్రీ విద్వాన్ విశ్వంగారి అనువాదం సులభమైన జాతీయ వ్యావహారికంలో నడిచిపోతూ పుస్తకం అంతా హాయిగా చదివించివేస్తుంది జటిలమైన ఆర్థిక రాజకీయ సాంకేతికపదాలకు క్రొత్తగా వీరెన్నో నూతన పదాలు సమకూర్చారు చివర చేర్చిన ఈపదాల వివరణ, అనుబంధము పాఠకులకు బాగా సహాయకారిగా ఉన్నాయి

పుస్తకముద్రణము, ముఖచిత్రము మొదలైనవి ప్రసిద్ధాంగ్ల గ్రంథాలతో తులతూగేటట్లున్నాయి

ఇలాంటి ఉత్తమగ్రంథం ప్రచురించిన ఇంటింటి విజ్ఞానమాలవారు ప్రత్యేకంగా అభినందనీయులు విజ్ఞానప్రదములైన ఇలాంటి ఉత్తమ గ్రంథాలింకా ఈ గ్రంథమాలవారు ప్రకటించగలరని ఆశిస్తున్నాము

---

## తెలంగాణా తీరుతెన్నులు

‘భవదీయుడు.’

జనవాణి ప్రచురణలు, ఏ 9 349 నారాయణగూడ హైదరాబాదు దక్కన్ వెల రూపాయి

రచయిత ఇటీవల తెలంగాణాలో ఏర్పడిన పరిస్థితులన్నీ నిష్పాక్షిక దృష్టితో విచారించారు ఇంతేకాక లేఖా రూపంలో ఈగ్రంథం రచించి, ఈవిధమైన రచనలో తెలుగుభాష కొక క్రొత్తతెన్ను చూపించారు

ఈ రచయిత ప్రజాస్వామ్యాభిమానులైనా ప్రతిపక్షుల అభిప్రాయాలు కూడా విశాలదృష్టితో పరిశీలించినట్లు కనిపిస్తుంది ఇది తెలంగాణా సమస్య బోధపరుచుకోడానికి చాలావరకు సహకరిస్తుంది

---

## శ్రీ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారి షష్టిపూర్త్యుత్సవ సన్మానసంపుటము.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు.

దీనిలో, శ్రీ కోరాడ రామకృష్ణయ్య, మాకెపల్లి రామచంద్రశాస్త్రికవి, నిడుదవోలు వెంకటరావు, స్వామి శివశంకరశాస్త్రి మొదలైన ప్రముఖులు ప్రాచీన శాస్త్రీయ సారస్వతవిశారదులు, శ్రీ వెంక



అతని ప్రాణాలన్నీ
ఆమె మీదనే

అతనంటాడు, భార్య అన్నప్పుడు, అన్ని విధాలా తన భార్యవలెనే ఉండాలని. అందుకు కారణం, ఆమె మెలకువతో ప్రవర్తిస్తుంది.

ఆమె చాల చురుకైనది. ఉదయం వేళ భర్తకు ఆఫీసుకు కావలసిన దుస్తులన్నీ తీసి సిద్ధంగా వుంచుతుంది. సాయంత్రం అతడు ఇంటికి చేరుకోగానే రుచివంతమైన ఒక గ్లాసుడు 'టీ' చేసి అందిస్తుంది. ఆ 'టీ' చేయడానికి అట్టే ఖర్చు కూడా కాదు.

తియ్యని ఆమె చిరునవ్వువలెనే ఆమె చేసే 'టీ' కూడా అతడిని పరవశం చేస్తుంది. అందు చేతే అతని పంచప్రాణాలు ఆమె మీదనే పెట్టుకున్నాడు.

మంత్ర శక్తి నిచ్చే పానీయం
"టీ" త్రాగండి

